వేసవి తాపమే తెలియకుండుటకు
ఉత్తమమైనవి.

# అశోకా శాండల్‌వుడ్ ఫేస్ టాల్కు & ఆల్పర్పస్ పౌడర్సు

ప్రతి దినము ఉపయోగించిన. వేసవి తాపమునణచి - శరీరమును చల్లగాను హాయిగాను పరిమళభరితముగను ఉంచును.




## విజయ కెమికల్సు
మద్రాసు-7

---




## పొదుపునకు...

ప్రకాశవంతంగా, పరిశుభ్రంగా చిరకాలం, పొదుపుగా పని చేసే లాంపు.

ఎల్లపుడును వాడండి

# బెంగాల్

ఇండియాలో శ్రేష్టమైనది
బెంగాల్స్ కొయిల్డ్ కాయిల్ లాంపులే
ఎల్లపుడు వాడండి. నమ్మకమైనది.

మీకు చల్లని, ప్రకాశవంతమైన వెలుగునిచ్చే లాంపు

బెంగాల్ **హంస**
పాలతెలుపు లాంపు.




ఆంధ్రప్రదేశీకు సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
**జి.ఏ. పరశురామ్ & కంపెని.**
11-4-658/2, లకడికాపూల్. హైదరాబాద్-4. A.P.

బెంగాల్ ఎలెక్ట్రికల్ కంపెనీ, బెంగళూరు - 3 & మదరాసు - 17

# కాల్గేట్‌తో రోజంతా చెడ్డ శ్వాసను నిరోధించండి దంతక్షయాన్ని నివారించండి!

ఎందుచేతనంటే కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో ఒక్కసారి తోమినంతనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయ కారకులైన సూక్ష్మ క్రిములు తొలగిపోవును.

కాల్గేట్ 10 మందిలో 7 గురి చెడ్డ శ్వాసను వెంటనే అరికట్టినదని మరియు కాల్గేట్ పద్ధతితో భోజనానంతరం పళ్లు తోము కొనుట వల్ల దంత శాస్త్ర చరిత్రలో మునుపు ఎప్పుడూ ఎరుగనంత ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని శాస్త్ర పరీక్షలు నిరూపించాయి!
కోల్గేట్‌లో మాత్రమే యీ ఋజువు ఉన్నది.




మీకు పౌడరు కావాలంటే, ఈ ప్రయోజనాలన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడరు వల్ల పొందండి... ఒకరకమైన నెలల తరబడి వస్తుంది!

ఎంతో చక్కని పిప్పరమెంటు రుచికూడా—
కాల్గేట్‌తో క్రమంగా పళ్లు తోముకోవటం
పిల్లలకు చాలా ఇష్టం.




ఇప్పుడు! సూపర్ సైజ్ కొని ...డబ్బు పొదుపు చేయండి!

శుభ్రతకు, తాజా శ్వాసకు, ధవళ దంతాల కోసం...
ప్రపంచంలోని ఏ ఒక్క ఇతరటూత్‌పేస్టు కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు.

DC.G.38 TEL

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



విడి ప్రతి
**75** పైసలు

సంవత్సర చందా
రూ. **9/-**

శ్రీరాజ్ ఆర్ట్ ఫిలింస్
సవినయంగా సమర్పించు

# విచిత్ర కుటుంబం

దర్శకత్వం:
కె.ఎస్.ప్రకాశరావు

నిర్మాత:
వి.కె.పి.సుంకవల్లి






















ఆహార అణువులు మిగిలి పోయి వున్నప్పుడు ఏసిడ్స్ (అమ్లములు) ఏర్పడి పళ్లపైగల ఎనామెల్ యందు ప్రవేశించి, పనుకు దుళ్ల లోనికి చొచ్చుకుపోయి బాధాకరమైన సందులను కలిగించే సూక్ష్మ క్రిములకు జీవ ధాతువులను సృష్టించును.



బినాకా ఫ్లోరైడ్ యందుగల ఎస్. ఎమ్. ఎఫ్. పి. పళ్లపైగల ఎనామెల్ తో చేరి ఏసిడ్ల తాకిడిలను నిరోధించ గలిగించును.



బినాకా ఫ్లోరైడ్ యందుగల ఎస్. ఎమ్. ఎఫ్. పి. పళ్లపై గల ఎనామెల్ ను ధ్వంస పరచే పోట ఏసిడ్లు ఏర్పడకుండా నిలుపును.



బినాకా ఫ్లోరైడ్ యందుగల ఎస్. ఎమ్. ఎఫ్. పి. దంతక్షయ ప్రారంభ దశలోనే దగ్గుబడుటకు పళ్లపైగల ఎనామెల్ కు సహకరించును.










CIBA
Cosmetics

# బినాకా ఫ్లోరైడ్

దంతక్షయం మరియు
బాధాకరమైన
సందుల
మూడు రెట్ల-
నిరోధానికి

CIBA/CF-26 Tel.

*FOR PRECISION IN...*

# Colour Printing

*By Letterpress...*

...Its B. N. K's., superb printing that makes all the difference. Its printing experience of over 30 years is at the back of this press superbly equipped with modern machineries and technicians of highest calibre.



బాలాజీ ఫిలిమ్స్ వారి

# మామకు తగ్గ కోడలు

దర్శకత్వం
సి.యస్.రావు, B.A (LIT)

సంగీతం
యస్.రాజేశ్వరరావు





# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచిక తయారవుతూండగా మన ప్రెసిడెంటు డాక్టర్. జకీర్ హుసేన్ పరమపదించారు. అందరితోబాటు "చందమామ" కూడా ఆయన ఆత్మకు శాంతి కోరుతున్నది.

బేతాళకథ ["అమానుష శక్తులు"] పంపినవారు వై. వీరేంద్రనాథ్.

"స్వామిద్రోహం" అన్న కథలో ఒక నీతి ఉన్నది. సమర్థులు స్వశక్తితో అధికారం సంపాదిస్తారు. అశక్త దుర్జనులు ద్రోహంద్వారా అధికారం సంపాదిస్తారు. మేధావులు వారిని పట్టివ్వాలి.

సంపుటి 44 జూన్ '69 సంచిక 6




# పిరికిపంద

ఛత్రపురం రాజుకు శుభాంగు డని కొడు కుండేవాడు. అతను పసివాడుగా ఉండగానే పిరికిలక్షణాలు కనబరిచాడు. ఏనుగుల ఘీంకారం వింటే కెవ్వున అరిచి ఏడిచేవాడు. ఏ పులికూన అయినా కంటబడితే నిలువునా వణికేవాడు. అతని పిరికితనం చూసి కొందరు, "ఇతను పెద్దవాడై రాజ్యం ఎలా ఏలుతాడు? శత్రువులతో ఎలా పోరుతాడు?" అనేవారు.

"ఇంకా పసివాడు గదా! పెరిగి పెద్ద వాడై, సింహాసనం మీద కూర్చునే నాటికి, అందు కవసరమైన ధైర్యసాహసాలు అవే వస్తాయి," అనేనారు మరికొందరు.

శుభాంగుడు పెరిగి పెద్ద వాడయాడు. మంచి అందమూ, ఒడ్డూ పొడుగూ, తండ్రి కన్నా కూడా ఠీవి అయిన విగ్రహమూ— బాహ్య లక్షణాలన్నీ అతనికి బాగానే అమరాయి; కాని అతని పిరికితనం నానాటికీ పెరిగింది గాని, ఏ మాత్రమూ తరగలేదు. అతని ఆకారం చూసి ప్రజలు, "మన యువరాజు చేతి దెబ్బ తిన్నారంటే బంది పోటు మన రాజ్యం మీదికి మరి రాదు," అనుకున్నారు.

తీరా బందిపోటు వచ్చి పడేసరికి యువ రాజు జాడ ఎక్కడా కనిపించలేదు. పెద్ద రాజే సైనికులను వెంట బెట్టుకు వెళ్ళి, బందిపోటుతో హోరా హోరి పోరాడి, వాళ్ళను తరిమి కొట్టి రావలిసి వచ్చింది. ఆటు తరవాత శుభాంగుడు ఎక్కడి నుంచో ఊడిపడి, తాను వేటకు వెళ్ళాననీ, సింహాలతో హోరా హోరి పోరాడి వచ్చాననీ ప్రగల్భాలు పలికాడు. అయినా అతని మాటలు ఎవరూ నమ్మలేదు. అందరూ అతన్ని "పిరికిపంద" అని పిలవసాగారు. అతనికి రాజభవనంలో ఆవగింజంత మర్యాద కూడా లేకుండా పోయింది.

ఎస్. ఆదినారాయణరావు





ఈ విధంగా అందరి అవమానాలనూ సహిస్తూ ఉండలేక, ఒక రోజు శుభాంగుడు, మంచి గుర్రాన్ని అశ్వశాల నుంచి తీసుకుని, దానిపై ఎక్కి, తాను ఎవరో తెలియని దేశంలో పరువుగా బతుకుదామని, దేశం విడిచి వెళ్ళిపోయాడు.

చివరకతను అస్తగిరి అనే నగరానికి చేరుకున్నాడు. అతను గుర్రం మీద రాజ వీధి వెంబడి వస్తుండగా అస్తగిరి రాజ కుమార్తె చారుమతి అంతఃపుర గవాక్షం నుంచి చూసి, "ఆ వచ్చేవాడు ఏ దేవ లోకం నుంచో దిగి వచ్చిన ఇంద్రుడిలా గున్నాడు గాని, మామూలు మనిషిలాగా లేడు. అత నెవరో తెలుసుకురండి," అని పరిచారకులను పంపింది. చారుమతి స్వయంగా చాలా అందగత్తె కావటమే గాక, మంచి ఠీవీ, బారూ గల మనిషి. ఆమె శుభాంగుడు లాటి వ్యక్తిని ఎన్నడూ చూసి ఉండ లేదు.

పరిచారకులు తిరిగి వచ్చి, "దేవీ, మీరు చూసిన వ్యక్తి ఛత్రపురం రాజుగారి ఏక పుత్రుడు," అని చెప్పారు.

చారుమతి వెంటనే తన తండ్రి వద్దకు పోయి, ఛత్రపురం రాజకుమారుణ్ణి సగౌరవంగా ఆహ్వానించి, అతిథిసత్కారాలు చెయ్యమనీ, తాను అతని భార్య కావాలని నిశ్చయించుకున్నాననీ చెప్పింది. అస్తగిరి రాజు పరమానందభరితుడై, శుభాంగుణ్ణి ఆహ్వానించి, అతనికి తన కుమార్తెను పరిచయం చేసి, శుభాంగుడికి చారుమతి పైన అనురాగం ఏర్పడినట్టు తెలుసుకుని, ఆ ఇద్దరికీ వివాహం చేశాడు.

ఛత్రపురానికి ఉన్నట్టే అస్తగిరికి కూడా బందిపోటు బెడద ఉన్నది. శుభాంగుడికి వివాహమైన కొద్ది రోజులకే అస్తగిరి నగరం పరిసరాలలో బందిపోటు దొంగలు వచ్చి పడి, గ్రామాలు తగలబెట్టి, పశువులను తోలుకు పోసాగారు.





చారుమతి తన భర్త మీద అంతులేని నమ్మకం పెట్టుకుని, "మీరు వెంటనే బయలుదేరి బందిపోటుకు గట్టిగా బుద్ధి చెప్పి రండి. మన సైనికులు సిద్ధమవుతున్నారు. ఇదిగో మీ కవచం; ఇవిగో ఆయుధాలు!" అన్నది.

శుభాంగుడు వెలవెలపోతూ, "నా కిలాటి మాటలు చెప్పకు. బందిపోటుతో నేను యుద్ధం చెయ్యటమేమిటి? గాయాలు తగులుతాయి. ప్రాణం పోవచ్చు. నాకు కొట్లాట లంటే చెడ్డభయం!" అన్నాడు.

చారుమతి నిర్ఘాంతపోయింది. అతనంత పిరికివాడని ఆమెకు అప్పటి దాకా అనుమానమైనా లేదు. అతను హస్యాని కలా అంటున్నా డనుకుందామన్నా, అతని ముఖంలో చచ్చేభయం కనిపిస్తూ ఉంది.

ఆమె అతన్ని ఏమీ అనక తానే ఆపాదమస్తకమూ కవచం ధరించి, కత్తీ, బల్లెమూ చేతబట్టి బయటికి ఉరికింది. తన భర్త కోసం వేచి ఉన్న గుర్రం మీదికి లంఘించి, ఆమె గుర్రాన్ని దౌడు తీయించింది. యుద్ధానికి బయలుదేరటానికి సిద్ధంగా ఉన్న సైనికులు ఆమెను అనుసరించారు.

బందిపోటుతో కొద్ది పోరాటం జరిగింది. కొందరు చావగా, మిగిలినవారు పారిపోయారు. వాళ్ళు పట్టుకున్న పశువుల మందలు దొరికాయి. చారుమతి తన సైనికులతో సహా తిరిగి వచ్చింది.

నగరంలో వారంతా, బందిపోటుతో పోరినది రాజుగారి అల్లుడే అనుకుని, అతన్ని చూసి అభినందించటానికి రాజభవనం దగ్గిర గుమికూడారు. చారుమతి గుర్రం దిగుతూనే, మళ్ళీ వస్తానన్నట్టు జనానికి చెయ్యి ఊపి, అంతఃపురంలోకి దౌడుతీసింది.

శుభాంగుడు తన గదిలో ఒక మూల కూర్చుని ఉన్నాడు. ఆమె తన కవచాన్ని విప్పుతూ, "దీన్ని మీరు ధరించండి. మిమ్మల్ని అభినందించడానికి జనం బయట

వేచి ఉన్నారు," అంటూ తానే స్వయంగా అతనికి కవచం తొడిగింది. ఒక శిరస్త్రాణం మాత్రం పెట్టలేదు.

అతన్ని చూడగానే జనం జయధ్వానాలు చేశారు. బందిపోటుతో పోరాడి వచ్చినది అతను కాదని రాజభవనంలో కూడా ఎవరికీ తెలీదు. చారుమతి తమ్ములలో చిన్నవాడు మాత్రం అనుమానించి, "యుద్ధం చేసి వచ్చినది బావ కానేకాడు," అని పెద్దవాడితో అన్నాడు.

"ఛీ, ఊరుకో! ఎవరన్నా వింటే నవ్వి పోతారు," అన్నాడు చారుమతి పెద్ద తమ్ముడు.

"ఇంకోసారి యుద్ధం జరిగితే నే నన్నది రుజువు చేస్తాను, చూసుకో," అన్నాడు చిన్నవాడు.

ఇది జరిగిన కొద్ది కాలానికే మళ్ళీ బందిపోటు వచ్చి పడింది. చారుమతి తన భర్తను యుద్ధానికి పంపాలని మరొకసారి ప్రయత్నించింది, కాని ఆమె ప్రయత్నం సాగలేదు. ఈసారి కూడా ఆమే కవచమూ, ఆయుధాలూ తీసుకుని, గుర్రమెక్కి, సైనికులను వెంటబెట్టుకుని వెళ్ళి, బందిపోటును పరారీ చేసి తిరిగి వచ్చింది.

ఆమె రాజభవనం నుంచి గుర్రాన్ని దిగుతూండగా ఆమె చిన్నతమ్ముడు ఆమె పాదా





పోటును ఎదిరించి వచ్చారని అంతా అను కుంటున్నారు. అది అబద్ధమని తెలిస్తే మీకు కలిగే అపఖ్యాతి ఎంత దారుణమైనదో ఆలోచించండి," అన్నది చారుమతి.

శుభాంగుడు తన భార్యను తిట్టుకుంటూ కవచం ధరించి, ప్రజలకు తన ముఖం చూపించి, వారి ప్రశంస లందుకుని, తిరిగి వచ్చేశాడు.

చారుమతి చేతిలో ఓడి పోయిన బంది పోటు వారం తిరగకుండానే తమ రాజునూ, పెద్ద సేననూ వెంట బెట్టుకుని యుద్ధానికి వచ్చింది.

నీకి చిన్న గాయం చేశాడు. అది గమనించ కుండానే ఆమె లోపలికి వెళ్ళిపోయి, తన కవచం విప్పి భర్త కిస్తూ, తన పాదానికి అయిన గాయాన్ని చూసుకుని, "మీ కాలికి కూడా గాయం చేసుకోండి. లేకపోతే అందరూ నిజం తెలుసుకుంటారు," అన్నది.

"అమ్మో, గాయమే? రక్తం వస్తుంది," అన్నాడు శుభాంగుడు.

చారుమతి తన చేతిన ఉన్న బల్లెంతో అతని పాదాన్ని పొడిచింది. శుభాంగుడు కేకపెట్టి, విహ్వలుడై పోయాడు.

"ఈపాటి గాయానికి అంతగా దిగులు పడ నవసరం లేదు. మీరే వెళ్ళి బంది

"ఈసారి పెద్ద యుద్ధమే జరుగుతుంది. మన సేనలకు నాయకత్వం వహించి మీరు యుద్ధానికి వెళ్ళక తప్పదు. వెనకటి లాగా ఈసారి ప్రజలను మభ్యపెట్టటం సాధ్యం కాదు," అన్నది చారుమతి శుభాంగుడితో.

"నాకు యుద్ధం మాట చెప్పకు. మన సేనలకు నేనే నాయకత్వం వహించాలని ఎక్కడున్నది? మీ తమ్ముళ్ళలో ఎవరి నన్నా వహించమను. నేను యుద్ధానికి పోయి చావాలనా నీ కోరిక?" అన్నాడు శుభాంగుడు.

చారుమతి కొంచెం ఆలోచించి, "సరే అయితే ఒక పని చెయ్యండి. మీరు కవచం ధరించి గుర్ర మెక్కి ముందుగా వెళ్ళి,

ఊరి వెలపల చెరువు పక్క తోపులో ఆగండి. నేను అడ్డ దారిన వచ్చి మిమ్మల్ని కలుసు కుని మీ కవచం నేను వేసుకుంటాను. సేనలను కొంచెం వెనకగా బయలుదేరి రమ్మని కబురు చేస్తాను," అన్నది.

శుభాంగుడికి ఈ ఏర్పాటు నచ్చింది. ఒక వేళ తన భార్య అడ్డ దారిన రాక పోయినా తాను తోపులో దాక్కుని, యుద్ధం తప్పించుకోవచ్చు. రాజభవనంలోనే ఉంటే ఆ అవకాశం లేదు; ఒకరు కాకపోతే మరొక రైనా తనను యుద్ధానికి బయలుదేర తీయవచ్చు.

శుభాంగుడు కవచం ధరించి బయటికి వచ్చాడు. అతని వెంటనే వచ్చిన చారుమతి అతన్ని గుర్రం ఎక్కనిచ్చి ఆయుధాలు అందిస్తూ, గుర్రం వెనక కాళ్ళ మీద కమ్చీతో బలంగా కొట్టింది. ఆ దెబ్బకు గుర్రం పరుగు అందుకున్నది. సైన్యాలు శుభాంగుడి గుర్రాన్ని చూడగానే తాము కూడా బయలుదేరాయి. శుభాంగుడికి గుర్రం దిగే అవకాశం గాని, ఎక్కడైనా దాగే అవకాశం గాని లేదు. అతను తిన్నగా శత్రుసేనలుండే చోటికి వెళ్ళాడు.

రెండు సేనలకూ మధ్య తీవ్రంగా పోరు జరిగింది. పిరికిపందగా ఎన్నోసార్లు నిరూపించుకుని ఉన్న శుభాంగుడు ప్రళయకాల యముడు లాగా శత్రు సైనికులను నిర్మూలించి, మహా వీరుడని సైనికుల చేత పొగడ్త లందుకున్నాడు. విజయం అతనిదే అయింది.

తన భర్తలో కలిగిన ఈ మార్పు చూసి చారుమతి ఆశ్చర్యపడలేదు. అతను భయపడుతూ వచ్చినది భయాన్ని తలుచుకునే గాని అపాయాన్ని గురించి కాదని ఆమె అదివరకే గ్రహించింది.

అటుతరవాత శుభాంగుడు ఎన్నో యుద్ధాలు చేసి, వీరాధివీరు డనిపించుకుని, తన తండ్రికీ, మామగారికీ కూడా ఎంతో ప్రతిష్ఠ తెచ్చాడు.



# నిజంలాంటి అబద్ధం

నిజంలాటి అబద్ధం చెప్పినవారికి బంగారు మామిడిపండు ఇస్తానని ఒక తెలీ తెచని రాజు చాటింపు వేయించాడు.

బంగారు మామిడిపండు పై ఆశతో ఎందరెందరో వచ్చి రకరకాల అబద్ధాలు చెప్పారు. కాని రాజుకు అవేవీ నచ్చలేదు. అందులో కొన్ని నిజం కూడా కావచ్చు; మిగిలినవి పచ్చి అబద్ధాలు. అందుచేత రాజుగారు బంగారు మామిడిపండును ఎవరికి ఇవ్వలేదు.

ఒకనాడు ఒక బిచ్చగాడు పెద్ద కుండ పట్టుకుని రాజుగారి వద్దకు వచ్చాడు.

"ఏం కావాలి నీకు?" అన్నాడు రాజు.

"నాకు తమరు ఈ కుండెడు బంగారం బాకీ ఉన్నారు. ఇప్పించండి," అన్నాడు బిచ్చగాడు.

"అబద్ధం! నేను నీ కేమీ బాకీ లేను," అన్నాడు రాజు.

"అబద్ధమా? అయితే ఆ బంగారు మామిడిపండు నా మొహాన పారెయ్యండి!" అన్నాడు బిచ్చగాడు.

రాజుగారు సంతోషించి వాడికి బంగారు మామిడిపండు ఇచ్చేశాడు.






# 18

[నాగుమల్లిని ఎత్తుకుపోయిన శిథిలాలయ పూజారి, ఆమెను విడిచి పుచ్చేందుకు, శివాలుణ్ణి తాళపత్రగ్రంథం మూల్యంగా చెల్లించమన్నాడు. శివాలుడు అందుకు అంగీకరించాడు. దొంగలువున్న చోటుచూసి శిఖిముఖి తిరిగి వస్తూండగా, అలికిడి విన్న సవరభేరుండం, ఈటెను ఝుళిపిస్తూ అతడి పైకి రాసాగాడు. తరవాత—]

శిఖిముఖి క్షణాల మీద తను ఏమి చెయ్యటం క్షేమమో ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాడు. సవర భేరుండాన్ని వెనక నుంచి వెళ్ళి తలమీద బలంగా ఒక దెబ్బ కొట్టి చడీ చప్పుడూ లేకుండా చంపెయ్యవచ్చు. కాని, అందువల్ల పూజారి ముఠా తమ రహస్య నివాసం శత్రువులకు తెలిసిపోయిందని, నాగుమల్లిని మరొక చోటుకు ఎత్తుకుపోయి దాయవచ్చు...

ఇలా ఆలోచించిన శిఖిముఖి, సవర భేరుండం కంట బడకుండా పారిపోయేందుకు ఒక ఎత్తు వేశాడు. అతను దాగివున్న పొదల్లో నుంచి దాపుల నున్న మరికొన్ని పొదల కేసి నాలుకాళ్ళ మీద నడుస్తున్న జంతువులా కుప్పించి దూకుతూ, చిరుతగండు కోపంతో అరిచినట్టు పెద్దగా గర్జన చేశాడు. ఆ ధ్వని వింటూనే సవరభేరుండం బెదురుకుని తక్కన ఆగిపోయి, వెనక్క



ఒక్కొక్క అడుగే వేస్తూ, "చిరుతగండా! ఏదో మనిషనుకున్నాను," అన్నాడు భయం వల్ల వణుకుతున్న గొంతుతో.

భేరుండాన్ని యింత తేలిగ్గా మోసగించ గలిగినందుకు సంతోషపడిపోతూ, శిఖిముఖి మరింత బిగ్గరగా అరుస్తూ, పొదల చాటు నుంచి మహా వృక్షాలున్న అరణ్యంలోకి పరిగెత్తాడు. బయట అడవి జంతువు అరవటం వింటూనే, ఇంట్లోకి పోయిన శిథి తాలయ పూజారి, ధొంగల్లో యిద్దర్ని సవర భేరుండానికి సాయం వెళ్ళమని చెప్పాడు.

ఆ దొంగ. లిద్దరూ కత్తులూపుకుంటూ, "ఎక్కడ చిరతపులి? ఎక్కడ?" అంటూ



సవర భేరుండం వున్న పొదల దగ్గిరకు పరిగెత్తుకు వచ్చారు.

సవర భేరుండం అప్పటికి తేరుకుని, పెద్దగా నవ్వుతూ, "ఇంకెక్కడి చిరత? అది నా మీదికి దూకబోయే సమయంలో ఈ ఈటెతో గట్టిగా ఒకే పోటు పొడిచాను. ఆ దెబ్బకు వెల్లకిలా పొదల్లో పడి లేచి అరణ్యం కేసి దౌడు తీసింది," అన్నాడు.

"భేష్, సాహసంలో, తెగువతనంలో మాతో సరితూగ్గలవాడివి. ఇక రా. పూజారి దొర నీ కేదో ప్రమాదమైన పని ఒప్ప చెప్ప బోతున్నాడు," అన్నాడు దొంగల్లో ఒకడు.

"ప్రమాదమైన పనా? ఉహూఁ, నాకేం భయం లేదు. ధొర ఆజ్ఞాపిస్తే, అలా ఆకాశంలోకి ఎగిరిపోగలను. నేను మానవ గండభేరుండాన్ని, తెలుసుగా!" అన్నాడు సవరభేరుండం.

"ఆ సంగతి మాకు తెలుసు. తెలియని వాళ్లు నువ్వేదో హెచ్చులు మాట్లాడు తున్నావనుకుంటారు. పూజారి దొర మంత్ర శక్తికి తిరుగేమిటి?" అన్నాడు దొంగల్లో రెండోవాడు.

"ఏవిఁటా చచ్చు కబుర్లు? భేరుండాన్ని చిరుతపులి పీక కొరికి ఎత్తుకు పోలేదు, నయం! వాడు బాగా మైకంలో వున్నట్టు



న్నాడు. వాగుడు కట్టి పెట్టి రమ్మనండి," అంటూ శిథిలాలయ పూజారి కేకపెట్టాడు.

సవర భేరుండాన్ని యింత తేలిగ్గా మోసం చేసి అరణ్యంలోకి పారిపోయిన శిఖిముఖి అతి వేగంగా లోయలోకి పరిగెత్తాడు. అక్కడ అతడు దివిటీల వల్ల లోయ అంచున వున్న ఇంటిని గుర్తించి, అక్కడికి చేరేసరికి, శివాలుడూ, సవర గండుపోతూ—అందరూ కనిపించారు. శిఖిముఖి వాళ్ళకు, నాగుమల్లి బంధించబడి వున్న ఇంటిని గురించి చెప్పి, దాన్ని చుట్టుముట్టితే, ఆమెను రక్షించటమే గాక, శిథిలాలయ పూజారిని కూడా పట్టుకుని బంధించవచ్చని తెలియపరిచాడు.

శివాలుడు తన కొడుకు చెప్పినట్టు చేయటమే సరిఅయిన మార్గం అని సవర గండుపోతుతో సంప్రతించి నిర్ణయించాడు. తండ్రి ద్వారా శిఖిముఖి, పూజారి తాళపత్రాలున్న సంచీని వేలాడకట్టమన్న రావిచెట్టు సంగతి విన్నాడు. అతడు ముందు జాగ్రత్తగా, ఆ రావిచెట్టు ప్రాంతాల కాపలాకోసం ఇద్దరు శబరయువకుల్ని పంపాడు.

ఆ తర్వాత ధైర్యసాహసాలు గల పది మంది శబర యువకుల్నీ, విక్రమకేసరినీ వెంటబెట్టుకుని శిఖిముఖి, శిథిలాలయ



పూజారివున్న ఇంటి కేసి వేగంగా ప్రయాణమయాడు. అరగంట తరవాత ఆ ఇంటి ప్రాంతాన్ని చేరేసరికి శిఖిముఖికి, యీ సారి ఇంటి ముందున్న పొదల ప్రాంతాల దొంగల్లో ఒకడు అటూ యిటూ గస్తీ తిరుగుతూండటం కనిపించింది, కిటికీలోంచి దీపకాంతి బయటికి పడుతున్నది.

ఆ గస్తీవాణ్ణి చూస్తూనే శిఖిముఖికి, పూజారి ఏదైనా ప్రమాదాన్ని శంకించాడా అన్న అనుమానం కలిగింది. వాడు బహుటక్కరి. నాగుమల్లిని మరో చోటుకు ఎత్తుకు పోలేదు గదా అన్న భయం కలిగిందతడికి. ఏది ఏమైనా ముందు ఇంటిని చుట్టు



ముట్టాలి. శిఖిముఖి, విక్రమకేసరితో తాను చేయబోయే పని గురించి చెప్పాడు. గస్తీ వాడు ముందుగా హెచ్చరిస్తే, ఇంట్లో వున్న శత్రుమూక అంతా పారిపోయే ప్రమాదం వున్నది. కనక గస్తీవాణ్ణి కిక్కురుమన కుండా తుదముట్టించాలి.

శిఖిముఖి అనుచరుల్ని అంత దూరాన వదిలి పొదల వెనగ్గా పాకుతూ పోయి, గస్తీవాడు తానున్న పొద పక్కగా నడిచే సమయంలో వెనకనుంచి కత్తిపిడితో బలంగా నెత్తిమీద కొట్టి, వాడు కింద పడ బోయే సమయంలో అరవకుండా వుండేం దుగ్గాను గొంతు పట్టుకోబోయాడు. కాని, దొంగ దెబ్బ తిని ముందుకు తూలి పడ బోతూనే పెద్దగా చావుకేక పెట్టాడు.

ఆ కేక వింటూనే ఇంట్లో వున్న శిథి లాలయ పూజారి ప్రమాద మేదో ముంచుకు వస్తున్నదని గ్రహించి, సవర భేరుండంతో, "ఒరే, భేరుండం! మనం తక్షణం యీ ఇల్లు వదిలి పోవాలి. నా వెంట పరిగెత్తుకు రా!" అంటూ ఇంటికి వెనకవైపు నున్న వాకిలి తెరుచుకుని, దాపుల నున్న అరణ్యం కేసి పరిగెత్తాడు.

శిఖిముఖి గస్తీ దొంగ కేక పెట్టగానే తాను వేసిన పథకం చెడిందని గ్రహించి, తన అనుచరుల్ని ఇంటిని చుట్టు ముట్ట మని హెచ్చరించాడు. విక్రమకేసరీ, శబర సవర యువకులూ ఇల్లు చుట్టుముట్టారు. శిఖిముఖి ఇంటి ముందు ద్వారం నుంచి, విక్రమకేసరి వెనక వైపు నున్న ద్వారం నుంచీ కత్తులు ఝళిపిస్తూ లోపలి కడుగు పెడుతూనే, "అందరూ లొంగి పొండి. ఎదురు తిరిగారో ప్రాణాలు దక్కవు, జాగ్రత్త!" అన్నారు.

కొయ్యబల్ల మీద కూర్చుని వున్న నాగు మల్లి వాళ్ళదరి కేసీ వింతగా చూస్తూ, "భలే తెలివైన వాళ్ళు. మీరు పట్టుకోదలి చిన పూజారి వెధవ భేరుండంతో యింతకు





ముందే పారిపోయాడు. అదుగో, ఆ మూల వున్న ముగ్గురు సోమరి వెధవలూ మూంచి కైపుతో కళ్ళు మూశారు. భూకంపం వచ్చి ఇల్లు కూలినా లేవరు," అన్నది.

శిఖిముఖి, నాగుమల్లిని సమీపించి మౌనంగా ఆమె కాలి చేతి కట్లను విప్ప సాగాడు. విక్రమకేసరి అతడి దగ్గిర కొచ్చి, "ఏం, శిఖీ! ఆ పూజారి దుర్మార్గుణ్ణి వెంబడించే ప్రయత్నం చేయొద్దా? వాడు మరో సారి మనందరినీ మోసగించి పారి పోయాడు," అన్నాడు.

"వాడు రోజులు మూడిననాడు గాని మన చేతబడడు. ఈ గుడ్డి వెన్నెల్లో వాణ్ణి యీ మహారణ్యంలో ఎక్కడని వెతుకుతాం? మనకు అనవసర శ్రమ తప్ప ఫలితం వుండదు. ఇదిగో, యీ గండుపోతు కూతుర్ని తండ్రికి ఒప్ప చెపితే, మన బాధ్యత తీరి పోతుంది. ఆ తరవాత మనం నిశ్చింతగా మీ తాతగారిని గురించి తెలుసుకునేందుకూ, ఆ శిథిలాలయ రహస్యం ఏమిటో కనుక్కునేందుకూ బ్రహ్మపుత్రా నదీ ప్రాంతాలకు పోదాం," అన్నాడు శిఖిముఖి.

నాగుమల్లి కట్లు వూడతీయగానే లేచి నిలబడబోయి, రక్తప్రసారం సరిగా జరగక కాళ్ళు చచ్చు పడటంతో తిరిగి బల్లమీద కూర్చుంటూ, విక్రమకేసరితో, "ఈ శబర కుర్రాడికి ఆ శిథిలాలయ పూజారి ఎంత జిత్తులమారో యింకా తెలిసినట్టు లేదు. వాడు మీకంటె ముందుగా ఆ బ్రహ్మ పుత్రా లోయల్లోని శిథిలాలయాన్ని చేరతాడు," అన్నది.

"అక్కడికి వెళ్ళేందుకు అవసరం అయిన దారి గుర్తులూ అవీ వున్న పటం గల తాళపత్రాలు మా దగ్గిర వున్నవి. ఆ దారేదో తెలుసుకునేందుకే పూజారి ఆ తాళపత్రాల కోసం యింతగా తెగించి ప్రయత్నించాడు. అవి జన్మలో వాడిచేత బడవు," అన్నాడు శిఖిముఖి.







తలలు నరక బోతున్నట్టు చెప్పాడు. దొంగలు ముగ్గురూ అతడి కాళ్ళా వేళ్ళా పడుతూ, "ఆ పూజారి దుర్మార్గుడు ఇచ్చిన డబ్బంతా నీ కిస్తాం. మమ్మల్ని ప్రాణాలతో వదులు," అన్నారు.

"ఏదీ, ఆ డబ్బు చూపండి?" అన్నాడు శిఖిముఖి.

దొంగలు ఒకరి ముఖాలొకరు చూసుకుని, చుట్టూ కలయచూడసాగారు. వాళ్ళెవరి కోసం చూస్తున్నారో గ్రహించిన శిఖిముఖి, "నాలుగోవాడి కోసం చూస్తున్నారా? వాడు కూడా వస్తేగాని, ఆ దాచిన డబ్బు బయటికి తీయటానికి లేదన్న మాట! సరే, బహుశా వాడీపాటికి నరకంలో వుండి వుంటాడు. వాడివంతు డబ్బు కూడా మీరే పంచుకుని, ఎక్కడనైనా యింత పొలం కొనుక్కుని సన్మార్గంలో బతకండి. దొంగల్లా మళ్ళీ ఏనాడైనా నా కంట బడ్డారో, ఆ క్షణానే మీ ప్రాణాలు తీస్తాను," అన్నాడు.

అంతలో గది మూల నిద్రపోతున్న దొంగల్లో ఒకడు పెద్దగా ఆవులిస్తూ కళ్ళు తెరిచి, శిఖిముఖి వాళ్ళను చూసి, భయంతో కంపించి పోతూ తోటి వాళ్ళను నిద్ర లేపాలని చూశాడు. కాని వాళ్ళు కదల లేదు. శిఖిముఖి వాళ్ళను సమీపించి కత్తిపిడితో ఒక్కొక్కళ్ళీ పొడుస్తూ, "ఇక లేవండి. మీ యజమాని పారిపోయాడు. మీ ముగ్గురి తలలూ రావిచెట్టుకు వేళ్ళాడ గట్ట బోతున్నాను," అన్నాడు.

తతిమ్మా యిద్దరు దొంగలూ కళ్ళు తెరుస్తూనే, శిఖిముఖిని చూసి అదురుకు పోయారు. శిఖిముఖి మరోసారి వాళ్ళకు

శిఖిముఖి వెంట నాగుమల్లీ తతిమ్మా అనుచరులూ ఇంటి బయటికి వచ్చారు. విక్రమకేసరి, శిఖిముఖితో, "శిఖీ! పూజారికీ, దొంగలకూ ఆశ్రయం అయిన యీ ఇంటిని యిలా వుండ నివ్వటం నా కిష్టం లేదు. వాళ్ళు మరోసారి యిక్కడ చేరి దుర్మార్గ



కార్యాలు చేయవచ్చు. దీనికి నిప్పుపెట్టటం మంచిది," అన్నాడు.

శిఖిముఖి, "నీ యిష్టం," అంటూ తల వూపాడు. విక్రమకేసరి ఇంట్లోకి పోయి వెలుగుతున్న దివిటీ తీసుకుని బయిటికి వచ్చి, ఇంటి నాలుగు పక్కలా దానితో అంటించాడు. చూస్తూండగానే పెద్ద మంటలు లేచినై. శిఖిముఖీ అతడి అనుచరులూ సంతోషంగా చప్పట్లు చరుస్తూ లోయ కేసి బయలుదేరారు. చచ్చినవాడు చావగా మిగిలిన ముగ్గురు దొంగలూ, కాలే ఇంట్లో నుంచి తమకు పనికి వస్తవనుకున్న కొయ్యబల్లలూ, వంటపాత్రలూ హడావిడిగా బయటికి తెచ్చుకోసాగారు.

లోయ సమీపంలో వున్న పూరిపాక దగ్గిర తిరిగి అంతా కలుసుకున్నారు. సవరగండుపోతు తన కుమార్తెను చూసి పొందిన ఆనందం అంతా యింతా కాదు. అతడు నాగుమల్లిని బుజ్జగిస్తూ, "నిన్నా పూజారి కుక్క ఉత్తరాదికి ఎత్తుకు పోయాడే అనుకున్నాను. అదృష్టం కొద్దీ దొరికావు. ఆ పిచ్చికుక్కగాణ్ణి ఏదో విధంగా పట్టుకుని కండకు కండ కోసి కాకులకూ గద్దలకూ వెయ్యకపోతే నేను గండుపోతునే కాదు," అన్నాడతను.



శివాలుడు చిరునవ్వు నవ్వుతూ, "గండుపోతూ, మనం యిలాంటి ప్రతిజ్ఞలు చేసి నెరవేర్చుకోగలిగిన స్థితిలో లేం, పెద్దవాళ్ళమయి పోయాం. శిఖిముఖీ, విక్రమకేసరీ ముందుగా శూరసేనదేశం వెళ్ళి, విక్రమకేసరి తండ్రిగారితో మాట్లాడి బహుశా అక్కణ్ణించి బ్రహ్మపుత్రా నదీలోయ ప్రాంతాలకు వెళతారు. ఒకవేళ వాళ్ళకు తిరిగీ ఆ శిథిలాలయ పూజారి నని చెప్పుకునే దుష్టుడు ఎదురైతే, తప్పక వాణ్ణి నీ కోసం కాళ్ళూ చేతులూ కట్టి తీసుకు వస్తారు. అప్పుడు నువ్వు వాణ్ణి చిత్రహింసలకు గురిచెయ్యవచ్చు," అన్నాడు.

శివాలుడి మాటలకు అందరూ వినోదంగా నవ్వారు. తరవాత సూర్యోదయం అవుతూనే శివాలుడూ, గండుపోతూ తమవాళ్లను వెంటబెట్టుకుని తిమ్మగూడెం చేరారు. అక్కడ ఆ పగలూ, రాత్రీ వినోదాలతో, విందులతో కాలంగడిపి శివాలుడు మర్నాటి ఉదయం తన కుంభారమిట్ట పల్లెకు బయలుదేరాడు. అతడు ప్రయాణమయే సమయంలో నాగుమల్లి, శిఖిముఖిని ఒక పెద్ద చెట్టు చాటుకు పిలిచి, తనను కాళ్లూ చేతులూ కట్టి హింస పెట్టిన శిథిలాలయ పూజారి శిక్ష కావాలన్నది.

"వాడు మాకు ఆ లోయల్లో తటస్థపడాలే కాని, వాడి తలే నరికి తెచ్చి నీ కిస్తానని వాగ్దానం చేస్తున్నాను. కాని, తిరిగి రావటానికి ఎంత కాలం పడుతుందో చెప్పలేను. ఈ లోపల నువ్వు మరొక సవరవాడి పెళ్ళాం అయిపోతే, వాడు నా మీద ఈటె ఎత్తుతాడు," అన్నాడు శిఖిముఖి.

ఆ మాటలు నాగుమల్లికి కోపం, సిగ్గూ కూడా తెప్పించినై. ఆమె తలవంచుకుని నేల చూపులు చూస్తూ, "నన్ను సవరవాడు కాదు గదా, మరే శబరవాడు కూడా చేసుకోలేడు," అన్నది వణుకుతున్న కంఠ స్వరంతో.

"అంటే....నాకేం తెలియటం లేదు," అంటూ శిఖిముఖి అమాయకంగా, నాగుమల్లి ముఖం కేసి చూశాడు.

నాగుమల్లి ఏదో చెప్పబోయింది, కాని అంతలో శివాలుడు పెద్దగా, "ఊఁ, యిక అందరూ బయల్దేరండి. శిఖిముఖి ఎక్కడ?" అన్నాడు.

నాగుమల్లి చప్పున కదిలి ఇంటి కేసి పరిగెత్తింది. ఎర్రగండు అరుస్తూ శిఖిముఖి దగ్గిరకు వచ్చింది. శిఖిముఖి దాని తల నిమిరి నాగుమల్లి అన్న మాటల్లోని భావమేమిటా అని ఆలోచిస్తూ తండ్రి దగ్గిరకు బయలుదేరాడు. —(ఇంకా వుంది)





# అమానుష శక్తులు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, కొందరు వ్యక్తులు తాము ఎంతో కష్టించి సాధించిన అమానుష శక్తుల్ని ఇతరుల మేలు కోసం ఉపయోగించ దలిచినా, ఒకోసారి ఎన్నో అవమానాలకు గురికావలసి వస్తుంది. ఇందుకు తార్కాణంగా నీకు ప్రచండుడు అనేవాడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు:

పూర్వం అవంతీనగరంలో ప్రచండుడనే అనాథబాలు డొకడుండేవాడు. వాడు ఊహ తెలిసినప్పటి నుంచీ నగర వీధుల్లో తిరుగుతూ, వారినీ వీరినీ యాచించి పొట్ట నింపుకుంటూండేవాడు. ఇలా వాడు పదిహేనేళ్ళపాటు నిరాశ్రయుడుగా ఎంతో అవ

## బేతాళ కథలు

మానకరమైన జీవితం గడిపి, ఒకనాడు నగరాని కొచ్చిన ఒక సిద్ధుడి వెంట అరణ్యానికి వెళ్ళాడు.

ఈ సిద్ధుడు క్షుద్రదేవతోపాసకుడు. ప్రచండుడు ఎంతో భక్తిశ్రద్ధలతో అతడికి నాలుగైదేళ్ళ పాటు పరిచర్యలు చేసి, అతణ్ణించి ఒక మంత్రం ఉపదేశం పొందాడు. ఆ తరవాత అతడు గురువు వద్ద సెలవు తీసుకుని ఒంటరిగా అడవుల్లోనూ, శ్మశానాల్లోనూ క్షుద్రదేవతల ప్రాపకం కోసం పూజలు జరపసాగాడు.

కొంత కాలానికి యీ క్షుద్రదేవతల అనుగ్రహం వల్ల అతడి కొక అమానుష శక్తి అలవడింది. అతడు ఏ మనిషి ముఖమైనా సరే చూస్తూనే, ఆ మనిషి నెల రోజుల్లోపల చనిపోతాడో లేదో చెప్పగలిగే వాడు.

కొత్తగా సంపాయించిన యీ శక్తి ద్వారా ప్రచండుడు గ్రామాల్లో తిరుగుతూ అక్కడి సంపన్న గృహస్తులకు తన విద్య ప్రదర్శించి, వారి నుంచి కొద్దిపాటి పారితోషికాలు పొందుతూండేవాడు. కాని, అతడికిందువల్ల తిండీతిప్పలకు లోటు లేకపోయినా ప్రజల నుంచి గౌరవమర్యాదలు మాత్రం కరువయాయి.

ప్రచండుడు అది గ్రహించి తాను ఏ రాజు దగ్గరకైనా పోయి, తన అమానుష



శక్తిని ప్రదర్శించి, పెద్ద బహుమాన మేదైనా తీసుకుని, దానితో పెళ్ళాడి గృహస్తు కావటం ఉత్తమమన్న నిర్ణయాని కొచ్చాడు.

ప్రచండుడు అవంతీ నగరం చేరి, రాజు గారి కొలువుకు పోయి ఆయనతో తన కున్న అమానుషశక్తి గురించి చెప్పి, కావాలంటే పరీక్షించమన్నాడు. కాని, రాజుకు యిటు వంటి శక్తుల్లో నమ్మకం లేకపోగా, అలాంటి శక్తులున్నవని చెప్పే వాళ్ళని చూస్తే అవ హేళన కూడా. ఆ కారణం వల్ల ప్రచండుడు రాజుగారి వల్లనేకాక, కొలువు తీరి వున్న సభికుల నుంచి కూడా అవమానం పొంద వలసి వచ్చింది.

ప్రచండుడు కొలువు నుంచి బయటికి వచ్చాడు. అతడిలో అవంతీ రాజుపై ప్రతీకారం జరిపి తీరాలన్న తీవ్రమైన కోర్కె కలిగింది.

కొలువులో ప్రవేశిస్తూనే అతడు రాజును చూసి, అతడికి యింకా ఇరవై అయిదు రోజుల్లో మృత్యువు రాసి పెట్టి వున్నదని గ్రహించాడు. రాజు మర్యాదగా ప్రవర్తించి వున్నట్టయితే, అతడికి తన శక్తి ప్రదర్శించి, తరవాత ఏకాంతంగా అతడి మృత్యువు సంగతి చెప్పి, యీ ఇరవైఅయిదు రోజుల లోగా రాజ్యవ్యవహారాలు తగు విధంగా సరిదిద్దుకోమని చెప్పాలనుకున్నాడు.






ప్రచండుడు అవంతీ రాజ్యానికి పొరుగు రాజ్యమైన మణిపురానికి పోయి, దాని రాజైన సునందుణ్ణి దర్శించాడు. సునందుడు యువకుడు, పరాక్రమశాలి, జ్ఞానవంతుడు. అతడికీ అవంతీరాజుకూ ప్రబల శత్రుత్వం వున్నది. ప్రచండుడు, సునందుడితో తను సంపాయించిన అమానుషశక్తిని గురించి చెప్పాడు. సునందుడు ఆ మాటలు నమ్మినట్టు గాని, నమ్మనట్టు గాని ఏమీ అనక, తన పరివారంలో ఎవరు ముందుగా మృత్యువువాత పడనున్నారో చెప్పమన్నాడు. ప్రచండుడు ఆ చుట్టు పక్కల వున్న రాజ పరివారంలో ఒక భటుణ్ణి రహస్యంగా రాజుకు చూపి, వాడు మరి రెండు రోజుల్లో మరణిస్తాడని చెప్పాడు.

ప్రచండుడు చెప్పినట్టే రెండవ రోజు సాయంకాలానికల్లా భటుడు హఠాత్తుగా గుండె ఆగి మరణించాడు. సునందుడు, "ప్రచండా, నీ అమానుషశక్తుల్లో నాకు పూర్తి విశ్వాసం కలిగింది. కాని, నీ శక్తులు నాకు గాని, నా రాజ్యానికి గాని చేసే మేలు ఏముంది ?" అన్నాడు.

"నా శక్తిని మీ రాజ్యాభివృద్ధికీ, శత్రు సంహారానికీ ఉపయోగించు కోవలసిందిగా తమను కోరుతున్నాను. మీ శత్రువైన అవంతీరాజు యింకా ఇరవైనాలుగు రోజుల్లో మరణించనున్నాడు. మీరు సైన్యంతో బయలుదేరి ఆ రోజున అతడి నగరాన్ని ముట్టడించారో, రాజు మరణం వల్ల చెల రేగే గందరగోళంలో మీరు నగరాన్ని తేలిగ్గా ఆక్రమించుకోవచ్చు," అన్నాడు ప్రచండుడు.

ప్రచండుడు యిచ్చిన సలహా మేరకు, సునందుడు రహస్యంగా తన సైన్యాన్ని సమకూర్చుకుని అవంతీరాజుకు మృత్యువు రానున్న రోజున అతడి నగరం మీద హఠాత్తుగా దాడి చేశాడు. యుద్ధం ప్రారంభమయిన కొద్ది క్షణాల్లోనే కోటలో రాజు మరణించాడన్న వార్త కార్చిచ్చులా నగ

రంలో వ్యాపించింది. ఆ వార్త వింటూనే అవంతీ సైనికులు ధైర్యం కోల్పోయి సునందుడి సైన్యానికి లొంగిపోయారు.

సునందుడు అవంతీరాజ్యాన్ని మణిపుర రాజ్యంలో కలుపుకున్నాడు. ఆ తరవాత ఒకటీ రెండు నెలల కాలం గడిచీ గడవక ముందే అతడు ప్రచండుణ్ణి తన రహస్య మందిరంలోకి పిలిపించి, తన ధనాగారం నుంచి కావలసినంత ధనం తీసుకుని రాజ్యం విడిచి పొమ్మని అజ్ఞాపించాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, సునందుడు ప్రచండుణ్ణి తన రాజ్యం వదిలి పొమ్మనటానికి కారణం ఏమై వుంటుంది? తనకూడా మృత్యువు ఆసన్నమైనప్పుడు ఏ శత్రురాజు దగ్గిరకో పోయి అతణ్ణి తన మీదికి ఉసికొల్పుతాడనా? లేక క్షుద్ర దేవతోపాసకుడు తన రాజ్యంలో వుండటం, రాజ్యానికి అరిష్ట కారణం అవుతుందనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రచండుడి రాజ్యబహిష్కరణకు యివేమీ కారణం కాదు. అవంతీ రాజ్యాన్ని జయించటానికి ప్రచండుడు చేసిన సాయంతో సునందుడికి అతడి ప్రయోజనం తీరిపోయింది. కొత్తగా అతడు తనకు చేయగల సాయం ఏమీ లేదు. పైగా అతణ్ణి యింకా కొలువులో వుంచుకుంటే, మృత్యువు ఆసన్నమైన ప్రతి ఒక్కరికీ ఆ సంగతి ముందుగానే చెప్పి, వాళ్ళకు అనవసరమైన చింతా, దుఃఖం కలిగించే ప్రమాదం వున్నది. అందుకే ప్రచండుణ్ణి చేసిన సహాయానికి తగిన విధంగా ధనాగారం నుంచి కావలసినంత ధనం తీసుకుని వెళ్ళమన్నాడు," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. (కల్పితం)





# రాజుగారి సమస్య

పూర్వం రాచకొండ రాజ్యాన్ని రఘురామ రాజు పాలించేవాడు. ఆయనకు తరచుగా విచిత్రమైన సమస్యలు కలుగుతూండేవి. ఆయన సభ చేస్తూ, ఉన్నట్టుండి ఒక వింత అనుమానం బయటపెట్టి, సభలోని వారిని సమాధానం అడిగేవాడు. ఆయన తెచ్చిన సమస్యకు సమాధానం చెప్పలేని వాళ్ళనూ, సమాధానం లేదన్నవాళ్ళనూ ఆయన ఏదోవిధంగా శిక్షించేవాడు.

ఒకనాడు సభలో రాజుగారు ఒక వింత అనుమానాన్ని బయటపెట్టాడు. అదేమిటంటే: ప్రపంచంలో ఎక్కడైనా నష్టం కలిగించని దొంగతనాలూ, కష్టం కలిగించని మోసాలూ జరుగుతాయా అని. దొంగతనం జరిగినప్పుడు ఎవరో ఒకరు నష్టపోకుండా ఉండటం ఎలా సాధ్యం? మోసం జరిగితే మోసపోయినవాడు కష్టపడడా? అందుచేత, సభలోని వాళ్ళంతా రాజుగారిది అర్థంలేని ప్రశ్న అనుకున్నారు. కాని పైకి ఎవరూ ఆ మాట అనలేదు.

ఎవరూ ఏమీ అనకపోవటం చూసి రాజుగారు మంత్రితో, "అలాటి దొంగతనాలూ, మోసాలూ జరుగుతున్నాయనే నా నమ్మకం. అవి ఎక్కడ జరిగాయో విచారించి, పది రోజులలోగా నాకు తెలియజేయాలి," అన్నాడు.

మంత్రి పని అయిందని అందరూ అనుకున్నారు. ఆయన మర్నాటి నుంచీ సభకు రావటం మానేసి, దివాణంలో జరిగేదంతా తన నౌకర్లద్వారా తెలుసుకుంటూ వచ్చాడు.

ఇది జరిగిన రెండు మూడు రోజులకే రాజుగారికి ఎంతో ఇష్టమైన మచ్చలావుకు ఏదో జబ్బు చేసింది. దాని జబ్బు ఒకంతట నయం కాలేదు. అది నిశ్చయంగా చచ్చిపోతుందని కూడా అనుకున్నారు. కాని అది చావక, క్రమంగా కోలుకుని,

పలిగూరి లక్ష్మీకృష్ణమూర్తి

రాజుగారు మంత్రి కిచ్చిన పది రోజుల గడువు లోపలనే ఆరోగ్యం పొంది, ఎప్పటి కన్నా ఎక్కువ పాలు ఇవ్వనారంభించింది.

మంత్రి తన గడువు పూర్తి అయేలోపల రాజుగారి ప్రశ్నకు సమాధానం ఆలోచించుకుని, పదవనాడు యథాప్రకారం సభకు హాజరయాడు. మంత్రిని చూస్తూనే రాజు, "నష్టం కలిగించని దొంగతనమూ, కష్టం కలిగించని మోసమూ ఎలా ఉంటాయో అంతు చిక్కిందా?" అని అడిగాడు.

"అది విన్నవించుదామనే వచ్చాను. ఎవరికీ నష్టంలేని దొంగతనం నేనే చేశాను. తమరు ఆగ్రహించనని అభయమిస్తే మనవి చేసుకుంటాను," అన్నాడు మంత్రి.

"చెప్పు, చెప్పు," అన్నాడు రాజు.

మంత్రి ఇలా చెప్పాడు:

"మహారాజా, మీ సమస్యకు సమాధానం వెతుకుతూ నేను మన రాజ్యమంతా మారు వేషంలో తిరిగాను. అలా తిరుగుతూ ఓ నాటి సాయంకాలం కొత్తపల్లి గ్రామం చేరాను. అక్కడ ఒక భూస్వామి ఇంటి అవరణలో చావటానికి సిద్ధంగా ఉన్న ఒక మచ్చలావు కనిపించింది. అయన తన కమతగాళ్ళతో, 'ఈ ఆవు ఎలాగూ బతకదు. చచ్చేదాకా దీన్ని మేపటమూ,



వైద్యం చేయించటమూ, చచ్చినాక దీన్ని లాగేయించటమూ వగైరాల కింద ఇంకా ఎంత ఖర్చున్నదో తెలియటం లేదు,' అని విసుక్కుంటున్నాడు. ఈ మాటలు విన్న నేను ఆ రాత్రి ఆ గ్రామంలోనే ఉండి, ఒక రాత్రివేళ దాన్ని దొంగిలించి, బండి మీద వేయించుకుని మన నగరానికి తెచ్చాను. నేను తెచ్చిన అవుకు ఉబ్బస రోగమని, తగిన చికిత్స చేస్తే అది తేలికగా కోలుకుంటుందని వైద్యులు చెప్పారు. అయితే అదే సమయంలో తమ మచ్చలావు చావటానికి సిద్ధంగా ఉన్నట్టు విన్నాను. వెంటనే నేను దొంగిలించి తెచ్చిన అవును

దాని స్థానంలో ఉంచి, తమ ఆవును తీసుకు పోయి శ్మశానం చేర్చాను. అది దారిలోనే ప్రాణాలు విడిచింది. నేను తెచ్చిన ఆవుకు మన వైద్యులు చికిత్స చేసి బతికించారు. అది ఇప్పుడు చాలా ఆరోగ్యంగా ఉన్నదనీ, ఇంకా ఎక్కువ పాలిస్తున్నదనీ, మీరు వైద్యులకు మంచి బహుమానాలు కూడా ఇచ్చారనీ విన్నాను. కొత్తపల్లి భూస్వామి కూడా తన ఆవు పీడ విరగడయినందుకూ, ఖర్చు తప్పినందుకూ సంతోషించాడు. చూశారా, నేను రెండు దొంగతనాలు చేసి ఇద్దరినీ సంతోషపెట్టాను. పైపెచ్చు ఒక ఆవు ప్రాణాలు కాపాడి పుణ్యం కూడా సంపాదించుకున్నాను."

సభలో అందరూ, మంత్రి మాటలకు "బాగుంది, బాగుంది!" అన్నారు.

రాజు కూడా తృప్తిపడి, "పోతే కష్టం లేని మోసం ఎలా ఉంటుందో కూడా తెలుసుకు వచ్చావా?" అని మంత్రి నడిగాడు.

"అది కూడా నేనే చేశాను, మహారాజా!" అన్నాడు మంత్రి.

"నువే మోసం చేశావా? ఎవరిని? ఎలా చేశావు? వాళ్ళకు కష్టం ఎందుకు కలగలేదు?" అని రాజు వరసగా ప్రశ్నలు కురిపించాడు.

"తమరినే మోసం చేశాను, మహారాజా. నేనింతకు మునుపు చెప్పినదంతా అబద్ధమే. నేను కొత్తపల్లి వెళ్ళనే లేదు. భూస్వామీ, అతని మచ్చలావూ, దాన్ని నేను దొంగిలించటమూ, మీ మచ్చలావు స్థానంలో దాన్ని ఉంచటమూ అన్నీ అబద్ధాలే. కోలుకున్నది తమ మచ్చలావే. అయినా నా అబద్ధాలు నమ్మి మీరు మోసపోయారు. కాని అందువల్ల మీకేమీ కష్టం కలగలేదే!" అన్నాడు మంత్రి.

రాజు తన మంత్రి తెలివితేటలను మెచ్చుకుని మంచి బహుమానా లిచ్చి, ఆదరించాడు.







# స్వామి ద్రోహం

పూర్వం మగధ సామ్రాజ్యాన్ని రాజసింహుడు ఏలిన కాలంలో కల్యాణపురం అనే చిన్న రాజ్యాన్ని విక్రమసింహు డనే రాజు పరిపాలించేవాడు. కల్యాణపురం మగధ సామ్రాజ్యంలో చేరినది కాదు. అది స్వతంత్ర రాజ్యం. రాజసింహుడా రాజ్యాన్ని అవలీలగా జయించ గలిగి ఉండి కూడా, విక్రమసింహుడితో స్నేహ సంబంధాలు పెట్టుకుని, ఎంతో ఆదర భావంతో చూస్తూవచ్చాడు. అందుకు కారణ మేమంటే, విక్రమసింహుడు చిన్నరాజే అయినా దొడ్డ బుద్ధిగలవాడు; తన రాజ్యాన్ని ఆదర్శప్రాయంగా పాలించేవాడు.

కల్యాణపురాన్ని ఆనుకుని ఉన్న కాంచనపురం మగధ సామ్రాజ్యంలోదే. దాన్ని పాలించే చండవర్మ రాజసింహుడి సామంతు, రాజసింహుడికి ఓడి తన స్వాతంత్ర్యాన్ని పోగొట్టుకున్నవాడు. అతను ఒక అశక్త దుర్జనుడు. అతనికి విక్రమసింహుడంటే అమిత ద్వేషం. ఒకప్పుడు ఇద్దరూ సమాన హోదాలు గలవాళ్ళే. ఇప్పుడు తాను సామంతు, విక్రమసింహుడేమో స్వతంత్రుడు; అంతేగాక తన యేలిక అయిన రాజసింహ మహారాజు స్నేహాన్ని కూడా సంపాదించుకున్నాడు.

ఇది చండవర్మకు దుస్సహంగా ఉండేది. తలుచుకుంటే రాజసింహుడు విక్రమసింహుణ్ణి క్షణాల మీద గెలవ గలడు. ఆ ఇద్దరి మధ్యా యుద్ధమే జరిగి, విక్రమసింహుడు ఓడిపోతే ఆ కల్యాణపురాన్ని కూడా తానే పాలించేటందుకు మహారాజు అనుమతించవచ్చు. కాని అలా జరిగే సూచనలు లేవు. విక్రమసింహుడు చండవర్మకు పక్కలో బల్లెంలాగా ఉన్నాడు.

"ఈ విక్రమసింహుడు పైకి కనిపించేటంత సజ్జనుడు కాడు, మహారాజా. పారు

అజ్జరపు హనుమంతరావు



గున ఉన్నవాణ్ణి నేను, దూరంగా ఉన్న వారు మీరు. అతన్ని గురించి నాకు బాగా తెలుసు. ఏ మాత్రం అవకాశం చిక్కినా అతను మన మీద దెబ్బ తీసి తీరుతాడు," అని చండవర్మ మహారాజుతో మాట వరసగా అని చూశాడు. కాని రాజసింహుడు అంతా విని ఏమీ అనక చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు.

విక్రమసింహుణ్ణి ఎలా నాశనం చెయ్యటమా అన్నది రానురాను చండవర్మకు ఒక తీవ్ర సమస్య అయి కూచుంది. ఇందుకోసం అతను అహర్నిశలు ఎదురు చూస్తుండగా, ఒక అవకాశం రానే వచ్చింది.

ఏటా విజయదశమి రోజులలో రాజసింహుడు ఉత్సవాలు జరుపుతాడు. దానికి సామంతులందరికీ ఆహ్వానాలు వెళతాయి. క్రమం తప్పకుండా విక్రమసింహుడికి కూడా ఆహ్వానం వెళుతుంది.

ఈ యేడు ఆ ఆహ్వానాన్ని శక్తిసింహుడనే యోధుడు తన వెంట తీసుకుని కల్యాణపురానికి బయలుదేరాడు. శక్తిసింహుడు గొప్ప వీరుడు. అనేక యుద్ధాలలో మహారాజుకు కుడి భుజంలాగా నిలబడి, విజయాలు సాధించటంలో ముఖ్య పాత్ర వహించినవాడు. మామూలు సమయాలలో మహారాజుకు అంగరక్షకుడు.

శక్తిసింహుడు ఆహ్వానపత్రాన్ని తీసుకుని కల్యాణపురానికి వెళుతూ చండవర్మ అతిథిగా కాంచనపురంలో ఒక రాత్రి విశ్రాంతి తీసుకున్నాడు. ఈ శక్తిసింహుణ్ణి మాయోపాయం ద్వారా విక్రమసింహుడి చేత చంపించినట్టయితే, మహారాజు విక్రమసింహుణ్ణి హతమార్చనిదే నిద్రపోడు. మహారాజుకు శక్తిసింహుడంటే అంతటి అభిమానం. విక్రమసింహుడు చచ్చాక అతని రాజ్యం సహజంగా సామ్రాజ్యంలో చేరిపోయి, పొరుగున ఉన్న తన పరిపాలన కిందికి వచ్చేస్తుంది.

ఆ రాత్రి శక్తిసింహుడు నిద్రపోయే టప్పుడు అతని వెంటనున్న ఆహ్వానాన్ని పైకి తీని, చండవర్మ దాని స్థానంలో తాను తయారుచేసిన మరొక పత్రం ఉంచాడు. మర్నాడు ఉదయం ఆ పత్రం పట్టుకుని శక్తిసింహుడు కల్యాణపురానికి వెళ్ళిపోయాడు.

విజయదశమి ఉత్సవాలు ఎప్పటిలాగే జరిగాయి. కాని అందులో పాల్గొనటానికి ఎప్పటిలాగా విక్రమసింహుడు రాలేదు. అతనికి ఆహ్వానం పట్టుకుపోయిన శక్తి సింహుడైనా తిరిగిరాలేదు. అతనేమైనదీ ఎవరికీ అంతుపట్టలేదు.

"శక్తిసింహుడికి ఏదన్నా జరిగితే, ఆ విషయం విక్రమసింహుడికే తెలియాలి. మిగిలినవాళ్ళకు ఎలా తెలుస్తుంది?" అన్నాడు చండవర్మ మహారాజుతో.

మహారాజు ఆశ్చర్యంతో, "శక్తిసింహుడికి విక్రమసింహుడు ఏదైనా ద్రోహం చేశాడనా నీ ఉద్దేశం?" అని చండవర్మను అడిగాడు.

"విక్రమసింహుడు ఏదో కుట్ర ఆలోచిస్తున్నాడని నాకు మొదటి నుంచీ అనుమానమే. ఆ కుట్రలో మొదటి ఎత్తే ఇది. మిగిలిన ఎత్తు లేవో నాకు అంతుబట్టటం లేదు," అన్నాడు చండవర్మ.





మహారాజు మెదడులో సూక్ష్మంగా అనుమానం తల ఎత్తింది. ఆ అనుమానాలను రహితం చేసుకునేటందుకు ఆయన ఒక రాయబారిని పంపాడు. ఆ రాయబారి తిరిగి వచ్చి, "మహారాజా, తమరు అడగమన్న ప్రశ్నలన్నీ అడిగాను. ఏ ఒక ప్రశ్నకూ విక్రమసింహ మహారాజు సమాధానం ఇయ్యలేదు," అన్నాడు.

మహారాజు మరొక రాయబారిని, ఇంకా సమర్థుణ్ణి, పంపాడు. కాని ఫలితం లేకపోయింది. మహారాజు అనుమానాలు రహితం కాకపోగా మరింతగా బలపడ్డాయి. ఒకటి మాత్రం రూఢి అయింది:



మహారాజుకు కుడిభుజంలాటి శక్తిసింహుడు జీవించి లేడు.

"విక్రమసింహుడు నాకు చేయరాని ద్రోహం చేశాడు. వెంటనే అతని పైకి యుద్ధానికి వెళ్ళి, అతన్ని మట్టు పెట్టేస్తాను," అని మహారాజు శపథం చేశాడు. తన ఎత్తు పారుతున్నందుకు చండవర్మ సంతోషం పట్టలేకపోయాడు.

మగధబలాలు కల్యాణపురం చేరి, నగరాన్ని చుట్టుముట్టాయి. మహారాజు శిబిరంలో చండవర్మ పెద్దపాత్ర నిర్వహిస్తూ, అడుగడుగునా మహారాజుకు సలహా లిస్తున్నాడు. ఇద్దరూ మహారాజుగారి గుడారంలో కూర్చుని మాట్లాడుకుంటూ ఉండగా ఒక సామాన్య సైనికుడు విక్రమసింహుడి నుంచి మహారాజుకు రాయబారిగా వచ్చాడు.

"మీ రాజు నాకు పంపిన సందేశమేమిటి?" అని మహారాజు రాయబారిని అడిగాడు.

"మీరు హఠాత్తుగానూ, అకారణంగానూ మా పైకి దండెత్తివచ్చారు. మేము యుద్ధానికి సిద్ధంగా లేము. మాకు కొంత వ్యవధి కావాలి," అన్నాడు రాయబారి.

"మేము మీతో బలాబలాలు తేల్చుకోవటానికి రాలేదు. మీ రాజు నాకు చేసిన





ద్రోహానికి శిక్ష విధించ వచ్చాను. యుద్ధానికి మీరు సిద్ధంగా లేకపోతే అనుభవించండి," అన్నాడు మహారాజు.

చండవర్మ ఆయనతో, "మహారాజా, వీళ్ళు అన్యాయంగా మన దూతను చంపారు. మనం ఈ దూతను చంపి పగ తీర్చుకుందాం," అన్నాడు.

"నువు తొందరపడకు," అని చండవర్మను వారించి, మహారాజు దూతతో, "మీరు శక్తిసింహుణ్ణి ఎందుకు చంపారు? మీకు ఏం ద్రోహం చేశాడు?" అన్నాడు.

దూత ఏమీ సమాధానం చెప్పక, మౌనంగా ఉండిపోయాడు.

మహారాజుకు క్రోధావేశం వచ్చింది. "ఏం మాట్లాడవు? మీ రాజుకు నా పైన ఈర్ష్య ఉంటే అందుకు ఒక నిరపరాధిని బలి పుచ్చుకుంటాడా? నాతో స్నేహం నటిస్తూనే ఇలా వెన్నుపోటు పొడుస్తాడా?" అన్నాడాయన.

దానికి రాయబారి కొద్దిగా ఉద్రేకం చెంది, "మా మహారాజుగారు మీ రాయబారిని బుద్ధిపూర్వకంగా హత్య చేయులేదు, మహారాజా," అన్నాడు.

వెంటనే చండవర్మ అందుకుని, "బుద్ధిపూర్వకంగా చంపలేదూ? మహారాజుగారు చంపమంటే చంపారా? వారు ఆహ్వాన పత్రంలో అతన్ని చంపమని ఆదేశించారు కాబోలు! ఏం?" అంటూ విరగబడి నవ్వసాగాడు.

"తమరు బాగానే గ్రహించారు. ఇదుగో, మీ మహారాజుగారు పంపిన ఆహ్వాన పత్రం," అంటూ రాయబారి ఒక ఆహ్వాన పత్రం తీసి రాజసింహుడి చేతికి అందించాడు. దాన్ని చూసి రాజసింహుడు నిశ్చేష్టుడయాడు. అందులో ఇలా ఉంది:

"ఈ పత్రం తెచ్చే శక్తిసింహుడు రాజద్రోహి. అతన్ని రహస్యంగా హత్య చేయవలెను—రాజసింహ."



"ఏమిటది?" అంటూ చండవర్మ ఆ పత్రాన్ని మహారాజు చేతి నుంచి తీసి చూశాడు. అది తాను కల్పన చేసినదే. అతని ముఖం వెల వెల పోయింది.

అతని ముఖాన్ని తీక్షణంగా పరికిస్తున్న మహారాజు చండవర్మతో, "నిజం చెప్పు. నువు కల్పించినది కాకపోతే ఈ పత్రంలో ఉన్నది నీ కెలా తెలిసింది?" అన్నాడు.

"అదే, మహారాజా, నా సందేహం కూడానూ," అంటూ రాయబారి తలపాగా తీసేశాడు.

"నువ్వేటోయ్!" అన్నాడు మహారాజు విక్రమసింహుణ్ణి గుర్తించి.

చండవర్మ ద్రోహం బయట పడింది. అతన్ని రాజభటులు పట్టుకున్నారు.

"ఈ దుర్మార్గుడి సంగతి అప్పుడే నాకు తెలియజేయక ఇంత కాలం ఎందుకు ఊరు కున్నావు, విక్రమసింహా?" అని అడిగాడు మహారాజు.

"ఈ పత్రాన్ని ఈ దుర్మార్గుడే సృష్టించి నట్టు రుజువు దొరికితే బాగుంటుందనీ, వీడింకా ఎన్ని దుశ్చర్యలకు పాల్పడతాడో చూతామనీ ఆగాను. మిమ్మల్ని నా మీదికి యుద్ధానికి తెచ్చాడు. మన స్నేహానికి చిచ్చు పెట్టాలని చేతనయినంతా చేశాడు. నాకు వీడి తత్వం మొదటినుంచీ తెలుసును. మీ ఔదార్యం కూడా నే నెరుగుదును. అందుచేత శక్తిసింహుణ్ణి ఇంత కాలమూ సురక్షితంగా నా వద్దనే ఉంచాను. చండవర్మ తాను తవ్విన గోతిలో తానే పడ్డాడు," అన్నాడు విక్రమసింహుడు.

చండవర్మ విచారణ అప్పటి కప్పుడే జరిగింది. అతనికి మరణదండన విధించారు. కాంచనపురానికి శక్తిసింహుణ్ణి రాజునుగా నియమించి, రాజసింహ మహారాజు కొంత కాలం విక్రమసింహుడి ఆతిథ్యం స్వీకరించి, తన సేనలతో సహా రాజధానికి తిరిగివెళ్ళాడు.






# వింత వీలునామా

ఒక గ్రామంలో ధర్మయ్య అనే ధనిక భూస్వామి ఉండేవాడు. ఆయనకు ఆ గ్రామంలో పెద్ద భవంతీ, వందలకొద్దీ పశువులూ, అంతులేని నగలూ, అనేక వందల ఎకరాల భూవసతీ, అసంఖ్యాకులైన జీతగాళ్లూ, పరిచారకులూ ఉండేవారు.

ధర్మయ్యకు ముగ్గురు కొడుకులు. పెద్దవాడు శ్రీధరుడు అందగాడూ, విలాసపురుషుడూనూ. రెండోవాడు విజయుడు పాడుపరీ, పొలం పనులూ, ఇతర వ్యవహారాలూ చూడటంలో ఆసక్తి కలవాడూ. మూడోవాడు ఈశ్వరుడు భోగలాలసుడూ, దుబారా మనిషీనీ.

మరణించే ముందు ధర్మయ్య తన వీలునామా రాసి, దానిని అమలు చేసే బాధ్యత తన దివాను పైన పెట్టాడు. ఆయన మరణించాక దివాను ధర్మయ్య కొడుకులు ముగ్గురినీ కూచోబెట్టి వీలునామా నిబంధనలు చదివి వినిపించాడు. ఆ నిబంధనలేవంటే:

తన ఆస్తిని తన ముగ్గురు కొడుకులకూ పంచాలి.

తమకు వచ్చిన వాటాలను కొడుకులు స్వాధీనపరచుకోరాదు, ఏ విధంగానూ అనుభవించరాదు.

వాళ్ళు తమ వాటాలను స్వాధీనపరచుకోనందుకు తమ తల్లికి, అనగా ధర్మయ్య భార్యకు, ఒక్కొక్కరూ రెండేసి వేల రూపాయలు చొప్పున చెల్లించాలి.

ఈ నిబంధనలు విని ధర్మయ్య కొడుకులు ముగ్గురూ నివ్వెరపోయారు. అవి ఎవరికీ అర్థం కాలేదు. ఈశ్వరుడు దివానుతో, "ఈ వీలునామాకు అర్థం ఉన్నట్టు కనబడదు. దీన్ని తయారుచేసేటప్పుడు మా తండ్రిగారి మనస్థితి అనుమానాస్పదంగా ఉన్నట్టు కనబడుతుంది. అందుచేత

కాపుగంటి త్రినాథ్ విజయకుమార్

ఉన్న ఆస్తిని మీరు మీ ఇచ్ఛానుసారం మా ముగ్గురికీ పంచండి," అన్నాడు.

"మీ తండ్రిగారు పూర్తి స్ఫురణలో ఉండే, బుద్ధిపూర్వకంగా దీన్ని రాశారు. ఆయన స్వయంగా రాసిన వీలునామాను అవతల పెట్టటం సాధ్యమా, బాబూ? అందులో అర్థం లేకపోలేదు. ఆ నిబంధనలకు భంగం రాకుండా ఆస్తిని పంచటం నా విధి. పదిమంది పెద్దలనూ పిలిచి, వారి ఎదటనే మీకు మీ తండ్రిగారి ఆస్తిని పంచుతాను. వీలునామాలో ఉన్న నిబంధనలు సరిగా అమలు జరిగాయని వారు ఒప్పుకుంటేనే నేను నా విధి నిర్వర్తించిన వాణ్ణి కాగలను," అన్నాడు దివాను.

ఆయన గ్రామంలో ఉన్న పెద్దలందరినీ పిలిపించి ధర్మయ్య వీలునామా చదివి వినిపించాడు. తరవాత తాను ఆస్తిని ఎలా పంచబోతున్నదీ అందరికీ వివరంగా చెప్పాడు.

"పొలాలూ, పశువులూ, జీతగాళ్ళూ, ఇతర వ్యవసాయ సరంజామా అంతా శ్రీధరుడి కిస్తున్నాను. ఇల్లూ, తోటా విజయుడి కిస్తున్నాను. దుస్తులూ, నగలూ, అలంకారాలూ పరిచారకులూ ఈశ్వరుడి కిస్తున్నాను," అన్నాడు దివాను.

ఇలా చెయ్యటంవల్ల ధర్మయ్య కొడుకులు ముగ్గురికీ వారికి నిరుపయోగమైనవి లభించాయి. అందుచేత వాళ్లు తమ వాటాలను ఒకరి కొకరు మార్చుకోవటం తప్పనిసరి అయింది. ఈశ్వరుడి వాటా శ్రీధరుడికీ, శ్రీధరుడి వాటా విజయుడికీ, విజయుడి వాటా ఈశ్వరుడికి మారింది. అలా మార్చుకుంటే తండ్రి పెట్టిన నియమాలు అమలు జరుగుతాయని వాళ్ళు తెలుసుకుని, దివానుగారి తెలివికి సంతోషించారు. వాళ్లు ముగ్గురూ తమ తల్లికి రెండేసి వేల రూపాయలు ఇచ్చారు. ఆ ఆరువేలతో ఆమె జీవితాంతం సుఖంగా జీవించింది.





# యోగ్యతాపరీక్ష

ఒక గ్రామంలో వరదరాజు అనే భూస్వామి వుండేవాడు. అతడికి ఒక కుమార్తె వుండేది, ఆమె పేరు లక్ష్మి. ఆమెకు వివాహయోగ్యమైన వయసు రాగానే, చుట్టుపట్ల గల గ్రామాల్లోని మోతుబరి రైతులు కొందరు వరదరాజు దగ్గిరకు పెళ్లి సంప్రతింపులకు రాసాగారు.

వరదరాజు అలా వచ్చిన వారికి అతిథి సత్కారాలు చేసి, "నా కున్నది ఒక్కగా నొక్క కూతురు. నా కాబోయే అల్లుడు తెలివిమంతుడూ, కష్టపడి పని చేసి సుఖపడాలన్న గుణం కలవాడూ అయుండాలన్నది నా కోర్కె. ఊరికే తింటూ కూర్చుంటే, నా ఆస్తి పాస్తులు ఎంతో కాలం రావు గదా? అందుకని మీ కొడుకుల్ని నా దగ్గిరకు పంపండి. ఒక చిన్న పరీక్ష పెడతాను. అందులో నెగ్గినవారికి నా కూతుర్నిచ్చి చేస్తాను," అని చెప్పసాగాడు.

కొద్ది రోజులు జరిగిన తరవాత పొరుగూరి వాళ్ళయిన ముగ్గురు యువకులు తండ్రుల అనుమతితో వరదరాజు ఇంటికి వచ్చారు. వాళ్ళు ముగ్గురూ దాదాపు ఒకే వయసు వాళ్ళు, చూడటానికి తెలివి తేటలూ, మంచీ మర్యాదా తెలిసిన వాళ్ళలాగే వున్నారు.

వరదరాజు ఆ ముగ్గురు యువకులతో, "మీరు ముగ్గురూ చేత చిల్లిగవ్వ లేకుండా ఎక్కడికైనా పోయి, నెల రోజుల్లోపల వంద రూపాయలు సంపాయించుకు రండి. ఆ తరవాత మీలో ఎవరికి నా కుమార్తె నివ్వాలో నిర్ణయిస్తాను," అని చెప్పాడు.

ఆ ముగ్గురు యువకులూ అందుకు అంగీకరించి బయలుదేరారు. వారిలో కోదండపాణి అనేవాడు తూర్పుగా ప్రయాణమై ఒక చిట్టడవి గుండా పోతుండగా, కాలిబాట పక్కన పిల్లలెవరో పారేసుకున్న చిన్న కొయ్య దేవతాబొమ్మ ఒకటి కన

బి. వెంకటరావు



బడింది. దాన్ని చూడగానే అతడికి ఒక ఉపాయం తోచింది. వెంటనే అతడు కొయ్య బొమ్మను తీసుకుని, బైరాగిలా వేషం వేసుకుని, ఒక గ్రామం చేరి ఇంత కుంకమూ, పసుపూ సంపాయించి బొమ్మకు పూసి, దాన్ని ముందు పెట్టుకుని ఒక చెరువు గట్టు మీది రావి చెట్టు కింద కూచున్నాడు.

చెరువుకు వచ్చీపోయే జనం అతడి చుట్టూ మూగసాగారు. కోదండపాణి వాళ్ళతో, "ఇది కాశీ దగ్గిర గంగానదిలో మా గురువుగారికి దొరికిన గంగామాత విగ్రహం. ఆయన ఆజ్ఞప్రకారం దీన్ని యీ చెరువు గట్టు మీద ప్రతిష్ఠ చెయ్యటానికి వచ్చాను. దీనికి భక్తితో పూజా పురస్కారాలు చేస్తే, తగిన సమయంలో వర్షాలు కురిసి యీ ప్రాంతమంతా సుభిక్షమవుతుంది," అని చెప్పసాగాడు.

కోదండపాణి చెప్పిన దాన్ని నమ్మిన వాళ్ళు, ఆ విగ్రహానికి అరటిపళ్ళూ, కొబ్బరి కాయలూ నైవేద్యం పెట్టసాగారు. కొందరు భక్తులు కలిసి చిన్న హుండీ ఒకటి తెచ్చి అందులో చిల్లర డబ్బులు వేసిపోయారు. మరి కొందరు ఒక దీపం, దానికి అవసరం అయిన నూనె యిచ్చిపోయారు.

వారం తిరిగీ తిరక్కముందే కోదండపాణి తెచ్చిన కొయ్యబొమ్మ గంగామాత విగ్రహంగా ప్రసిద్ధి సంపాయించుకున్నది. భక్తులు హుండీని డబ్బులతో నింపసాగారు. కోదండపాణి త్వరలోనే గంగామాత గుడి కట్టిస్తానని చెప్పసాగాడు. అతడు ప్రతి రోజూ రాత్రివేళ హుండీలో వున్న డబ్బు లెక్కపెట్టి, ఆ మొత్తాన్ని వేరే దాచటం మొదలు పెట్టాడు. పదిహేను రోజులు గడిచేసరికి అతడికొక్కవలసిన వందరూపాయలూ పోగయినై. ఈ లోపల ఇద్దరు ముగ్గురు యువకులు అతడికి శిష్యులయారు.

కోదండపాణి మరి కొద్ది రోజులపాటు అక్కడే వుండి హుండీలో పడే భక్తుల

కాన్కల్నీ తన శిష్యుల పరం చేస్తూ, గడువుకు ఇంకా నాలుగైదు రోజుల కాలం వుండనగా, వాళ్ళతో తనకు గురువుగారి నుంచి పిలుపు వచ్చిందనీ, వెళ్ళిపోతున్నాననీ, గంగామాత గుడి కట్టించే బాధ్యత మీదే ననీ చెప్పి, బయలుదేరాడు.

రెండో యువకుడు ఆనందుడు పడమరగా బయలుదేరాడు. అతడికి గడువు లోపల వందరూపాయలు సంపాయించటం మాట అటుంచి, ఏపూటకాపూట ఆకలి తీర్చుకోవటమే పెద్ద సమస్య అయి కూర్చున్నది. అతడికి తిండి కోసం యాచించడం పెద్ద అవమానంగా తోచింది. పెద్ద దొంగతనాలు చేసే అలవాటుగానిధైర్యంగానిలేదు. అందువల్ల ఆనందుడు చిన్నపిల్లల చేతుల్లోంచి తినుబండారాలు లాక్కునీ, డబ్బులు గుంజుకునీ కడుపు నింపుకోసాగాడు.

ఆనందుడు నిరాశతో యిక ఇంటికి తిరిగి పోదాం అనుకునే దశలో ఒక రాత్రివేళ అతడు కాలవగట్టు వెంట నడుస్తూండగా, ఎవడో వెనక నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి, అతడి మీద ఒక మూట పడవేసి పరిగెత్తసాగాడు. అంతలో వెనక నుంచి, "దొంగ! దొంగ!" అన్న కేకలు వినిపించినై. ఆనందుడు పరిస్థితి గ్రహించి పారిపోయేవాణ్ణి తరిమి పట్టుకున్నాడు.





అంతలో కొందరు మనుషులు అక్కడికి వచ్చారు. ఆనందుడు పట్టుకున్నవాడు ఒక పెద్ద దొంగ. వాడా రాత్రి జమీందారుగారింట విలువగల నగా నట్రా దొంగిలించి పారిపో తూండగా, కుక్క మొరగటంతో వాణ్ణి జమీందారుగారి నౌకర్లు వెంట తరిమారు. వాడు ఆనందుడి పాలబడ్డాడు. పోయిన ఆస్తి యావత్తూ దొరకటమే గాక, దొంగను కూడా అతిసాహసంతో పట్టుకున్నందుకు జమీందారుగారు ఆనందుడికి నూరురూపా యలు బహూకరించాడు. ఆ డబ్బు తీసు కుని ఆనందుడు సంతోషంగా తిరుగు ప్రయాణ మయాడు.



ఇక మూడోవాడైన గురునాధుడు ఉత్తర దిక్కుగా బయలుదేరి మధ్యాహ్నం వేళకు ఒక గ్రామం చేరి, ఒక ఇంటికి పోయి, "అయ్యా, ఆకలిగా వుంది. ఇంత తిండి పెట్టండి. మీ పొలంపనో, తోటపనో ఏదైనా చేస్తాను," అన్నాడు.

ఆ ఇంటి యజమాని అతడికి భోజనం పెట్టించి, ఆ సాయంత్రం తనతోపాటు పొలా నికి తీసుకుపోయాడు. గురునాధుడు ఒళ్ళొంచి బాగా కష్టపడి పనిచేశాడు. ఆ రాత్రి కూడా ఆ ఇంటనే అతడికి భోజనం దొరికింది. మర్నాడు తెల్లవారుతూనే అతడు మరో గ్రామానికి బయలుదేరాడు. అక్కడా ఒక రైతుకు తోటపనిలో సాయపడి తిండి సంపాయించుకున్నాడు. ఆ తరవాత మరో గ్రామం. ఈ విధంగా వారంరోజులు గడిచి పోయినై. కాని, గురునాధుడు ఒక్క చిల్లి గవ్వ కూడా సంపాయించలేక పోయాడు. తిండీతిప్పలూ మటుకు సుఖంగా జరిగి పోతున్నాయి.

గడువు కావస్తున్నది, వందరూపాయలు సంపాయించటం ఎలానా అని గురునాధుడు విచారిస్తూ, ఒకనాటి ఉదయం ఒక గ్రామం వీధి వెంట నడుస్తూండగా అతడికి ఒక చెట్టు కింద నలుగురైదుగురు మనుషులు

  

తగూలాడు తుండటం కనిపించింది. గురునాథుడు వాళ్ళ దగ్గిరకు పోయి సంగతేమిటో అడిగి తెలుసుకున్నాడు. ఆ తగూలాడేవాళ్ళలో ఒక వంటలపెద్దా, అతడికి సహాయంగా. వంటమనుషుల్ని తీసుకొస్తానన్నవాడూ వున్నారు. ఆ వంటమనుషుల్ని తెస్తానన్నవాడు ముగ్గురి కన్న ఎక్కువ మందిని సంపాయించలేక పోయాడు. మరిద్దర్ని తెమ్మంటూ వంటపెద్ద తగూ చేస్తున్నాడు.

గురునాధుడు వంటపెద్దను తనకు వంటా వార్పూ తెలియకపోయినా, పిండి రుబ్బటం, నీళ్ళు మోయటం లాంటి పనుల్లో సహాయపడగలననీ, తనను పనికి పెట్టుకోమనీ వేడుకున్నాడు. మరి వంటవాళ్ళు దొరికే అవకాశం లేనందునా, అవతల మోతుబరి రైతు ఇంట విందుకు వంట చేస్తానని మాట ఇచ్చినందునా, చిన్న పనులకైనా పనికొస్తాడని వంటపెద్ద గురునాధుణ్ణి తన వెంట తీసుకుపోయాడు.

అవి పెళ్ళిళ్ళకు మంచి ముహూర్తాలున్న రోజులు కావటంతో, గురునాధుణ్ణి ఆ వంటపెద్ద తసతోపాటు ఆ వూరూ యీ వూరూ తిప్పుతూ, గిట్టుబాటయ్యే కూలి అతడి కివ్వసాగాడు. గురునాధుడు నెల ముగిసేలోపల యీ విధంగా వందరూపాయలూ కూడ



పెట్టి, ఆ డబ్బుతో వరదరాజు ఇంటికి బయలుదేరాడు.

తన కుమార్తెను వివాహం ఆడదలిచిన ముగ్గురు యువకులూ గడువులోపలే తలా ఒక వందరూపాయలూ తెచ్చి తన చేత పెట్టగానే, వరదరాజు చాలా సంతోషించి మొదటగా కోదండపాణిని ఆ డబ్బు ఎలా సంపాయించావని అడిగాడు.

"నేను చాలా తెలివిగా మనుషుల మూఢ విశ్వాసాలను ఆసరా తీసుకుని ఓ చిన్న కపట నాటకం ఆడి, ఆ వంద రూపాయలూ సంపాయించాను," అంటూ కోదండపాణి దారిలో తనకు దొరికిన కొయ్య బొమ్మ గురించీ, ఆ తరవాత తాను చేసిన పనుల గురించీ వరదరాజుకు చెప్పాడు.

"నువ్వెలా డబ్బు సంపాయించావు?" అని వరదరాజు, ఆనందుణ్ణి అడిగాడు.

"నేను అదృష్ట జాతకుణ్ణయి వుండాలి," అంటూ ఆనందుడు తను దొంగను పట్టుకోవటం, జమీందారు మెచ్చి వందరూపాయలు యివ్వటం గురించి చెప్పాడు.

"నీ సంగతేమిటి?" అని వరదరాజు, గురునాథుణ్ణి ప్రశ్నించాడు.

"నేను జిత్తులూ, అదృష్టం వల్లా డబ్బు మూట చేజిక్కకుండానే కష్టపడి పని చేసి, యీ వందరూపాయలూ సంపాయించాను," అంటూ గురునాథుడు తాను చేసిన కూలీ పని గురించి వరదరాజుకు చెప్పాడు.

కోదండపాణి తెలివితేటలు గలవాడే కాని, వాటిని కృత్రిమ మార్గాన ఉపయోగించే తత్వం అతడిది. ఆనందుడు కేవలం అదృష్టాన్ని నమ్ముకుని కూర్చునే రకం మనిషి. పోతే గురునాథుడు కష్టించి పని చేసి ప్రతిఫలం ఆశించే స్వభావం కలవాడు. వరదరాజు యిలా ఆలోచించి గురునాథుడికి తన కుమార్తె నిచ్చి వివాహం చేశాడు.



# మట్టి సమస్య

ఒక గ్రామంలో ప్రజలు ఊర బావి ఒకటి తవ్వించాలని తీర్మానించారు. బావి తవ్వటానికి గ్రామాధికారి అనుమతి ఇచ్చి, మనుషులనూ, పర్యవేక్షకుణ్ణీ ఏర్పాటుచేశాడు.

పర్యవేక్షకుడు పని ప్రారంభించబోతూ గ్రామాధికారి వద్దకు వచ్చి, "బాబుగారూ, బావి తవ్వగా వచ్చే మట్టిని ఎక్కడ పోయిద్దామంటారు?" అని అడిగాడు.

గ్రామాధికారి కొంచెం ఆలోచించి, "ఆ మట్టి పొయ్యటానికి వేరే ఒక గుంట తవ్విద్దాం," అన్నాడు

"అప్పుడా గుంట మట్టి మళ్ళీ సమస్యే అవుతుంది గదండీ?" అన్నాడు పర్యవేక్షకుడు.

"ఆ మాత్రం తెలీదుటయ్యా? ఈ మట్టీ ఆ మట్టీ కూడా పట్టేటట్టుగా పెద్ద గుంట తవ్వించు," అని గ్రామాధికారి విసుక్కున్నాడు.





# మొద్దబ్బాయి

వీధి చివర పెంకుటింట్లో ఉండే అబ్బాయిని పిల్లలంతా మొ ద్ద బ్బా యి అని హేళన చేస్తూ, మాట్లాడసాగారు. తాతయ్య వాళ్ళను మందలించాడు.

"మొద్దబ్బాయిలు రాజకుమార్తెలను పెళ్ళాడి, రాజ్యాలు ఏలుతార(రా!" అన్నాడు తాతయ్య.

రాజకుమార్తెను పెళ్ళాడిన మొద్దబ్బాయి కథ చెప్పమన్నారు పిల్లలు. వాళ్ళకు కథలు వినటం సరదా అయితే తాతయ్యకు కథలు చెప్పటం కూడా సరదాయే గనక ఆయన మొద్దబ్బాయి కథ ప్రారంభించాడు:

అనగనగా ఒక పేదరాలుండేది. ఆ పేద రాలి కొక కొడుకు ఉండేవాడు. వాడే మొద్దబ్బాయి. వాడి తల లోపల ఏమీలేదు సరే కదా, తల పైన కూడా ఏమీ లేదు. అంటే, వాడిది బోడి తల; తోమి బోర్లించిన కంచుచెంబు లాగుండేది.

"ఎందుకూ పనికిరావు, ఎట్లా బతుకు తావురా? నెత్తిన ఒక్క వెంట్రుక లేదు, నీ కెవరు పిల్లనిస్తా(రా?" అనేది తల్లి.

అసలే మొద్దబ్బాయి గనక వాడికీ విచారం ఏమీ ఉండేది కాదు.

ఒకనాడేమయిందంటే, పల్లకీలో వెళు తున్న రాజు కూతురు వాడి కంట పడింది. పెళ్లాడితే రాజుకూతుర్నే పెళ్ళాడాలనుకుని మొద్దబ్బాయి ఇంటికి వెళ్ళి, తల్లితో, "అమ్మా, నువు వెంటనే రాజుగారి దగ్గిరికి వెళ్ళాలి. వెళ్ళి, వాళ్ళమ్మాయిని నా కిచ్చి చెయ్య మన్నానని చెప్పు!" అన్నాడు.

తల్లి, నోరూ, కళ్ళూ పెద్దవి చేసి, "హరి దౌర్భాగ్యుడా! నీ కేమైనా మతిపోయిందా ఏమిటి? అటువంటి పిచ్చి మాటలు వింటే రాజుగారు నీ మెడా, నా మెడా కూడా కత్తి రిస్తారు. నోరుమూసుకో! ఎన్నడూ యిలా వాగకు," అన్నది.

టి. నాగభూషణం

కాని మొద్దబ్బాయి తల్లి మాటలు విని పించుకోక, రాజుగారి దగ్గిరికి పొమ్మని పోరు పెట్టాడు. రోజూ ఒకే తీరున వాడు తనను చంపుకు తింటుంటే, వాడి బాధ భరించలేక మొద్దబ్బాయి తల్లి రాజుగారిని చూడబోయింది.

రాజుగారు సభ చేస్తున్నాడు. మొద్దబ్బాయి తల్లి మర్యాదగా, "మహారాజా, నా కొడుకు మతి లేనివాడు. మీ అమ్మాయిని చేసు కుంటానని మీతో చెప్పమని నన్ను చంపుకు తింటున్నాడు," అన్నది.

రాజు కూడా చిత్రమైన మనిషే. ఈ మాట విని అయన అరవాలేదు, కరవా లేదు. ఇదేదో గమ్మత్తుగా ఉన్నదే అని తనలో అనుకుని, "ఈ ముక్క నీ కొడుకే వచ్చి చెప్ప వచ్చునే. మధ్య నిన్ను రాయ బారం పంపటం దేనికి?" అన్నాడు.

తల్లి ఇంటికి వెళ్ళి మర్నాడు కొడుకును పంపింది. మొద్దబ్బాయి వచ్చి, రాజుగారికి వంగి నమస్కారం చేసి, చేతులు కట్టుకు నిలబడ్డాడు.

"ఏమోయ్? రాజకుమార్తెను పెళ్లాడా లంటున్నావుట కాదూ? అయితే, నా ఉద్దేశం ఏమిటో ఎరుగుదువా? రాజోద్యానంలో పాడే పక్షులు ఏవీ లేవు. ఎవడైతే వాటిని



తెచ్చి మా తోటలో ఉండేటట్టు చేస్తాడో వాడికి మా అమ్మాయినిచ్చి చేద్దామను కుంటున్నాను. చేతనైతే ఆ పని చెయ్యి," అన్నాడు రాజు.

మొద్దబ్బాయి, "చిత్తం!" అని బయలు దేరాడు. పాడే పక్షులు ఎక్కడ ఉంటాయో, వాటిని రాజోద్యానానికి ఎలా తీసుకు రావాలో వాడికి కొంచెం కూడా తెలియ లేదు. అందు చేత వాడు మతిచెడి, కాలు కాలిన పిల్లి లాగా ఊళ్ళ వెంట తిరగసాగాడు.

ఒకనాడు ఒక బైరాగి తారసపడి మొద్ద బ్బాయితో, "ఏం, వత్సా! ఎందు కంత విచారంగా ఉన్నావు?" అని అడిగాడు.





కుమార్తెను పెళ్ళాడి సుఖంగా ఉండు," అని మొద్దబ్బాయికి సలహా ఇచ్చి, బైరాగి తన దారిన తాను వెళ్ళిపోయాడు.

బైరాగి చూపిన దిక్కుగా వెళ్ళి మొద్ద బ్బాయి పక్షులుండే చెట్టు చేరుకున్నాడు. దాని మీద అన్ని రంగుల పక్షులూ ఉన్నాయి. చిన్నవీ, పెద్దవీ ఉన్నాయి. అన్నీ ఒక్కసారి పాడేస్తున్నాయి.

"ఓం ఫట్!" అన్నాడు మొద్దబ్బాయి.

వెంటనే అవి పాడటమూ, ఎగరటమూ మానేశాయి. మొద్దబ్బాయి పట్టుకుంటే అవి చిక్కాయి. వాడు వాటి నన్నిటినీ తీసుకు పోయి, రాజుగారి ఉద్యానవనంలో చెట్ల మీద ఉంచి, "ఓం ఫట్!" అన్నాడు. వెంటనే రాజుగారి ఉద్యానం పక్షుల పాట లతో నిండిపోయింది.

మొద్దబ్బాయి రాజుగారి వద్దకు వెళ్ళి, "మహారాజా, తమ ఆజ్ఞ చొప్పున రాజో ద్యానం నిండా పాడే పక్షులను ఉంచాను. ఇక నాకు రాజకుమార్తె నిచ్చి పెళ్ళి చెయ్యండి," అన్నాడు.

"దాని కేం భాగ్యం? నీ దగ్గిర ఇంద్ర జాల విద్య లేవో ఉండి ఉంటాయి. కనక నువు నీ బోడితల మీద జుట్టు మొలిపించు కుని పెళ్ళికి వచ్చెయ్యి. ఈ లోపుగా నేను

మొద్దబ్బాయి కళ్ళనీళ్ళు పెట్టుకుని బైరాగితో తనకు వచ్చిపడ్డ సమస్య ఏమిటో వివరంగా చెప్పాడు.

"నువు నిజంగా దీక్ష గలవాడివి. మరొక డైతే అంతా మరిచి పోయి ఇంకేదన్నా పని చూసుకుని ఉండును. ఇలా ఒక కోసు దూరం వెళ్ళావంటే ఒక బ్రహ్మాండమైన చెట్టు కనిపిస్తుంది. దాని నిండా పాడే పక్షులే. ఆ చెట్టు కిందికి పోయి, 'ఓం ఫట్!' అను. ఎక్కడి పక్షులక్కడ కదల లేకుండా ఉండి పోతాయి. అప్పుడు నువు వాటిని రాజుగారి తోటకు చేర్చి, 'ఓం ఫట్!' అను. అవి ఎప్పటి మాదిరిగా ఎగురుతాయి. ఆ తరవాత రాజ

పెళ్ళి ఏర్పాట్లు చూస్తాను," అన్నాడు రాజుగారు.

"చిత్తం!" అని మొద్దబ్బాయి రాజుగారికి వంగి నమస్కారం చేసి, తన బోడితల మీద జుట్టు తెప్పించే మార్గం ఏమిటా అని ఆలోచిస్తూ ఇంటికి వెళ్ళాడు.

వాడు అలా వెళ్ళగానే రాజు మంత్రిని పిలిపించి, "మంత్రీ, నీ కొడుక్కు నా కూతుర్నిచ్చి పెళ్ళి చేసేస్తాను. పెళ్ళి వెంటనే జరగాలి," అన్నాడు.

రాజు కూతురికీ, మంత్రి కొడుక్కూ పెళ్ళి నిశ్చయమైందని ఊరంతా పాక్కిపోయింది. మర్నాడే పెళ్ళి.

రాజు తన కింత అన్యాయం ఎందుకు చేస్తున్నాడో కనుక్కుందామని మొద్దబ్బాయి మర్నాడు ఉదయం పరుగుపరుగున రాజభవనానికి వెళ్ళాడు.

అప్పటికే పెళ్ళితంతు ఆరంభమయింది. పెళ్ళికూతురూ, పెళ్ళికొడుకూ పీటల మీద కూర్చున్నారు. పురోహితుడు మంత్రాలు చదువుతున్నాడు. పురోహితుడి శిష్యుడు పెద్దలకు అక్షింతలు అందిస్తూ తిరుగుతున్నాడు. పురోహితుడు పెళ్ళికొడుక్కు మంగళసూత్రం ఇచ్చి పెళ్ళికూతురి మెడలో కట్టమన్నాడు. పెళ్ళికొడుకు లేచి నిలబడ్డాడు.



ఈ అడావుడిలో బోడిగుండువాణ్ణి ఎవరూ గమనించలేదు.

"ఆం ఫట్!" అని మొద్దబ్బాయి గట్టిగా అరిచాడు.

అంతే! ఎక్కడివారక్కడ బొమ్మల్లాగా అయిపోయారు. అందరూ గుడ్లు అప్పగించి, మొద్దబ్బాయిని చూస్తూ ఉండిపోయారు.

పెళ్ళి చూడవచ్చిన పౌరులూ, రాజ భవనంలో ఇతర పనులు చూస్తున్నవాళ్ళూ, "ఏమిటిది? ఏమిటిది?" అన్నారు ఎంతో ఆశ్చర్యంగా.

మొద్దబ్బాయి వాళ్ళతో రాజు చేసిన మోసం చెప్పాడు.

"రాజుగారిదే తప్పు. ఈ పెళ్ళి జరగటానికి వీల్లేదు! అబ్బాయీ, నువు పెట్టిన మంత్రం విప్పు. రాజకుమార్తెను నీకే ఇచ్చి చేసేటట్టు చూస్తాం," అన్నారు వాళ్ళు.

"ఓం ఫట్!" అన్నాడు మొద్దబ్బాయి. మళ్ళీ అందరూ కదిలారు. అక్కడ చేరిన పదిమంది పెద్దలూ గడ్డిపెట్టిన మీదట రాజు మొద్దబ్బాయికి తన కూతురి నిచ్చి వైభవంగా పెళ్ళి చేసేశాడు.

"వాడి గుండు ఏమయింది, తాతయ్యా? జుట్టు లేకుండానే రాజుకూతుర్ని పెళ్ళాడాడా?" అని అడిగారు పిల్లలు.

"జుట్టుతోనే పెళ్ళాడాడు. లేకపోతే అంత గొప్ప మహా రాజుకూతురు ఒప్పుకుంటుందా ఏమిటి?" అంటూ తాతయ్య స్నానానికి లేచాడు.

"వాడికి జుట్టు ఎట్లా వచ్చిందో చెప్పకుండానే పోతున్నావేం, తాతయ్యా?" అన్నారు పిల్లలు.

"దాని కేముందిరా? నాటకాలాడేవాళ్ళ దగ్గర నుంచి టోపా ఒకటి సంపాదించి నెత్తిన పెట్టుకుని, 'ఆం ఫట్!' అనేసరికి అది శాశ్వతంగా తలకు అంటుకుపోయింది. ఆ మాత్రం తెలీదూ?" అంటూ తాతయ్య స్నానానికి వెళ్ళిపోయాడు.



# అమాయకురాలు!

కొత్తగా కాపరానికి వచ్చిన ఒక అమ్మాయికి జీడిపప్పు అంటే చాలా ఇష్టం. అత్తగారు చూడకుండా అటు వచ్చీ, ఇటు వచ్చీ ఒక్కొక్క పలుకు నోట్లో వేసుకుంటూ ఉండేది.

కొన్నాళ్ళయాక అత్తగారికి అనుమానం కలిగింది, ముంతలో జీడిపప్పు తరిగిపోయిందని. అనుమానించడానికి కోడలు తప్ప ఇంకెవరున్నారూ?

అత్త తన దొంగతనం పసిగట్టిందని కోడలుపిల్ల కనిపెట్టింది. ఒకనాడామె ఇల్లు ఊడుస్తూ నేల మీద పడిఉన్న జీడిబద్ద ఎత్తి, దాని కేసి వింతగా చూసి, "ఇదేం పప్పు, అత్తయ్యా?" అని అడిగింది.

"అయ్యో, పాపం. ఆ పిచ్చిపిల్లకు జీడిపప్పు మొహమే తెలీదు. నేను దాన్ని అనుమానించాను!" అని అత్తగారు పశ్చాత్తాప పడింది.





# మూర్ఖపద్ధతి

ఒక చిన్న పల్లెలో శివయ్యా, సుందరమ్మా అనే దంపతులుండేవారు. వాళ్ళకు బాగా వయసు ముదిరాక ఒక కొడుకు పుట్టాడు. వాడు చాలా చిన్న పిల్లవాడుగా వుండగానే సుందరమ్మ చనిపోయింది. తల్లి లేని కొడుకును శివయ్య మరీ గారాబంగా పెంచసాగాడు. తను దొడ్లో నానా శ్రమా పడి కూరగాయలు పండించి, వాటిని పట్టణంలో అమ్మి కుటుంబపోషణ చేసుకు వస్తున్నా, కొడుక్కు మాత్రం ఆ పని పాటులు ఏమీ చెప్పేవాడు కాదు శివయ్య. వాడు వేళకు తిని సోమరిపోతులా అక్కడా యిక్కడా తిరిగి వస్తూండేవాడు.

శివయ్య పెద్దవాడైపోతున్నాడు. కొడుకు అతడికి కూరగాయలు పెంచే పనిలో చిన్న మెత్తుసాయం కూడా చేయక పోవటం చూసి, ఇరుగు పొరుగు వాళ్ళు శివయ్యతో, "కుర్రవెధవను మరీ అంత పిచ్చి గారాబంగా పెంచటం మంచిది కాదు. కాస్త తోట పనీ అదీ నేర్పు, నీ బరువు భారం వాడూ కొంత మోస్తాడు," అనే వాళ్ళు.

కాని శివయ్య కొడుకు మీది వాత్సల్యం కొద్దీ యీ సలహాలేమీ పాటించేవాడు కాదు. "కుర్రకుంక, యింకా పదిహేనేళ్ళయినా నిండ లేదు. తోట పని ఒకళ్ళు నేర్పితే గాని పట్టుబడనంతటి గొప్ప విద్యా ఏం? మరి నాలుగేళ్లు గడిస్తే వాడే స్వయానా అన్ని పనులూ చేసుకుంటాడు," అనేవాడు.

ఒకనాడు శివయ్య పొద్దున్నే కూరగాయలు కోసి మూట గట్టుకుని సంతకు బయలుదేరుతూ, ఒకవేళ తాను తిరిగి రావటం ఆలశ్యం కావచ్చునని భావించి కొడుకుతో, "ఒరే, ఇవ్వాళ నేను చీకటి పడి గాని ఇంటికి రాను. కూరమళ్ళకు కాస్త నీరు తగిలేలా చూడు. కొత్త చేంతాడు బావి పక్కనే వుంది," అని చెప్పాడు.

పి. రాధామణి



శివయ్య కొడుకు సాయంత్రం కాగానే తండ్రి చెప్పిన తాడు తీసుకుని దాని ఒక కొసను బావిలో వేసి, రెండవ కొసను కూరగాయల పాదులన్నిటికీ తగిలేలా ఒక చుట్టు చుట్టి, వీధిలోకి ఆడుకోబోయాడు. శివయ్య సంతలో కూరగాయలు త్వరగా అమ్ముడుపోవటంతో పొద్దు గూక్క ముందే ఇంటికి తిరిగి వచ్చాడు.



అతడు కూరపాదుల దగ్గిరకు పోయి కొడుకు చేసిన పని చూసి పట్టరానంత కోపంతో కొడుకును పిలిచి, "ఒరే, నువ్వింత మూర్ఖుడివని అనుకోలేదు. లోకంలో అసలింత మూర్ఖులుంటారనేది, యీనాటివరకూ నాకు తెలీదు. ఏమయినా, లోకంలో నీ కన్న మూర్ఖుడు కనబడితే గాని ఇంటికి తిరిగి రాను," అని చెప్పి ఇల్లు వదిలి, మరో గ్రామం కేసి పోయాడు.

శివయ్య గ్రామం వీధిన నడుస్తూండగా ఒక పశువుల కొట్టంలోంచి ఒక కుర్రవాడు "అమ్మా!" అని బాధగా అరవటం వినిపించింది. శివయ్య కొట్టంలోకి పోయి, ఒక ఆవు కాళ్ళ దగ్గిర పడున్న కుర్రవాణ్ణి చూసి, ఏం జరిగిందని అడిగాడు.

"అమ్మకు జ్వరంగా వుంది. అయ్య యింట్లో లేడు. ఎక్కువ పాలు దూడ తాక్కుండా చూసి, చుక్కపాలు కింద పడకుండా, ఆవుపాలు పితుక్క రమ్మన్నది, అమ్మ. దూడ ఒక్క పాలచుక్కయినా కింద పడకుండా పాలు తాగటం చూసి, నేనూ అలాగే చేయబోయాను. ఆవు గట్టిగా తన్నింది," అన్నాడు కుర్రవాడు ఏడుస్తూ.

"వీడు నా కొడుక్కన్న కూడా మూర్ఖుడు!" అనుకుంటూ శివయ్య వాడికి పాలు పితకటం ఎలాగో చెప్పి, చీకటి పడుతుండగా మరో గ్రామం చేరాడు.

ఈ సారి శివయ్య గ్రామవీధిన అడుగు పెడుతూనే ఒక ఇంట్లో నుంచి పెద్ద అరుపులు రావటం విన్నాడు. ఒక ఆడగొంతు



విసుక్కుంటూ, "చలికి, ప్రాణం పోతు న్నదిరా, బాబూ! తొందరగా నిప్పు పెట్టు!" అంటున్నది. దానికి జవాబుగా ఒక చిన్న గొంతు "అరవకే, అమ్మా! నిప్పు పెడుతు న్నాను," అని జవాబిస్తున్నది.

శివయ్య ఏమిటా ఆ నిప్పు పెట్టటం అని అశ్చర్యపడుతూ చూసేంతలో ఒక కుర్ర వాడు మండుతున్న కట్టెపుల్లను ఇంటి చూరుకు అంటించబోతున్నాడు. ఆ కేకలు వేసుకుంటున్న వాళ్ళు తల్లీ కొడుకులని శివయ్య గ్రహించాడు. కాని, చలిగా వుంటే ఇంటికి నిప్పు పెట్టటం ఏమిటా అని అతడు ఇంటి గుమ్మాన్ని చేరేంతలో, తల్లి పెద్దగా, "తొందరగా నిప్పు పెట్టరా, బాబూ! ఇల్లు కాలిపోతే మరో ఇల్లు కట్టుకోవచ్చు. ప్రాణం పోతే వస్తుందా?" అంటున్నది.

శివయ్య కుర్రవాడి చేతిలో నుంచి మండే కట్టెపుల్లను లాక్కుని, సంగతేమి టని అడిగాడు. వాడి తల్లికి ఒంట్లో బాగో లేదు. చలికి ఆగలేక నిప్పు పెట్టమంటున్నది. వాడు ఇంటికి నిప్పు పెట్టేస్తున్నాడు.

తన కొడుకు కన్నా, పక్క గ్రామంలోని కుర్రవాడి కన్నా కూడా వీళ్ళిద్దరూ పెద్ద మూర్ఖులని శివయ్య అనుకుని, వాళ్ళకు చలి పోవాలంటే, ఇంటి మూల కుంపటిలో ఎలా నిప్పు వేసి రాజేసుకోవాలో చెప్పి, తన గ్రామానికి తిరిగి వచ్చాడు.

శివయ్య కిప్పుడు లోకంలో మూర్ఖులకు కరువు లేదని తెలిసిపోయింది. తను అతి గారాబంగా పెంచటం వల్లనే తన కొడుకు మూర్ఖుడుగా తయారయాడన్న గుర్తింపు కూడా కలిగింది. మర్నాటి నుంచీ అతడు కొడుకును తనతో పాటు తోటపని చేయించ సాగాడు. కొద్ది కాలంలోనే వాడికి ఆ పనిలో ప్రావీణ్యం రావటమే గాక, శివయ్య పెద్ద వాడైపోయింతరవాత, వాడే స్వయంగా కూరలు పండించి అమ్ముకువస్తూ, తండ్రికి ఏ శ్రమా లేకుండా చేసి, సుఖపెట్టాడు.






దుష్యంతుడి అనంతరం భరతుడు రాజై, కణ్వమహామునిని పురోహితుడుగా పెట్టుకుని మహా వైభవంగా రాజ్యపాలన చేశాడు. భరతుడి మునిమనమడు హస్తి అనేవాడు. ఇతని పేరనే హస్తినాపురం ఏర్పడింది. ఆ హస్తికి అయిదోతరం వాడు కురువు; అతని పేరనే కురుక్షేత్రం ప్రసిద్ధమయింది. కురుడికి ఏడోతరం వాడు ప్రతీపుడు. ఇతని భార్య శిబి కూతురైన సునంద. వీ రిద్దరికీ దేవాపీ, శంతనుడూ, బాహ్లికుడూ అనే ముగ్గురు కొడుకులు కలిగారు. వారిలో పెద్ద వాడైన దేవాపి తపస్సు చేసుకుంటానని వెళ్ళిపోవటం చేత శంతనుడు రాజయాడు.

ఒకనాడు శంతనుడు అరణ్యంలో వేటాడి గంగాతీరాన విశ్రాంతి తీసుకుంటూండగా అక్కడ అతని కొక చక్కని స్త్రీ కనిపించింది. ఆమె రూపలావణ్యాలు చూస్తే శంతనుడికి దేవకాంత అనిపించింది. ఆమె కూడా శంతనుణ్ణి చూసి ఆకర్షించబడిన దానిలాగా అతన్ని రెప్ప వేయకుండా చూడసాగింది. ఇద్దరికీ ఒకరి మీద ఒకరికి మోహం ఏర్పడ్డట్టు గ్రహించి శంతనుడు ఆమెను పలకరించి, "సుందరీ, నువ్వెవరు? ఒంటరిగా ఈ గంగాతీరాన ఎందుకు తిరుగుతున్నావు?" అని అడిగాడు.

"నీకు నన్ను పెళ్ళాడాలని మనసయినట్టయితే నా కేమీ అభ్యంతరం లేదు. కాని ఒక్క నియమం ఉన్నది: నేను చేసే పనులకు అభ్యంతరం చెప్పినా, నన్ను నిందించినా, నేను నిన్ను విడిచి వెళ్ళిపోతాను,"

4. భీష్మ ప్రతిజ్ఞ



అన్నది ఆ స్త్రీ. అందుకు సమ్మతించి శంతను డామెను భార్యగా పరిగ్రహించాడు.

వారి దాంపత్యంలో ఆమెకు వరసగా మగపిల్లలు కలుగుతూ వచ్చారు. పుట్టిన పిల్లలను పుట్టినట్టే ఆమె గంగలో పడేస్తూ వచ్చింది. ఇది శంతనుడికి చాలా బాధ కలిగించింది. కాని తాను ఇందుకు అభ్యంతరం చెబితే అమె తనను విడిచి పోతుందని భయపడి, ఏడుగురు కొడుకులను గంగ పాలు కానిచ్చాడు.

కాని ఆమె ఎనిమిదవసారి మళ్ళీ కొడుకును కన్నప్పుడు, ఆ బిడ్డను చావనివ్వటం ఇష్టంలేక ఆమెను తూలనాడుతూ, "పుట్టిన కొడుకు లందరినీ గంగలో వేశావు గదా. ఏ ఆడదైనా ఇలా సొంత బిడ్డలను చేతులారా చంపుకుంటుందా? ఇకనైనా ఈ పుట్టిన వాణ్ణి బతికి ఉండనీ. ఇంతకూ నువ్వెవరు? బిడ్డలందరినీ ఎందు కిలా చంపుతున్నావు?" అని అడిగాడు శంతనుడు.

"నీకు కొడుకు కావాలని ఉంటే వీణ్ణి చంపకుండా నీ కిస్తాను. నాకు అడ్డు చెప్పావు గనక నే నిక నిన్ను విడిచి వెళ్ళి పోతాను. నే నెవరి ననీ, నా పిల్లలను ఎందుకు చంపాననీ అడిగావు. చెబుతాను విను. నేను గంగను. వసిష్ఠుడు అష్టవసువులను మనుషులుగా పుట్టమని శపించగా, వారు నన్నూ, నిన్నూ తల్లిదండ్రులుగా కోరుకున్నారు. వారి కోసమే నేను స్త్రీరూపం ధరించి ఇన్నాళ్ళూ నీకు భార్యగా ఉన్నాను. నా గర్భాన పుట్టిన వసువులను త్వరలోనే వారి లోకానికి పంపగలందులకు, పుట్టగానే చంపేస్తూ వచ్చాను. నీకు కొడుకు లేకుండా పోతాడేమో నని వీణ్ణి బతకనిస్తున్నాను," అన్నది గంగ.

అయితే గంగ ఆ కొడుకును శంతనుడి కివ్వక, వాడితో సహా అంతర్ధాన మయింది. భార్యాపుత్రు లిద్దరినీ పోగొట్టుకున్న విచారంతో శంతనుడు హస్తినాపురానికి తిరిగి



వచ్చాడు. కొంత కాలం గడిచింది. ఒకనాడు అతను వేటాడుతూ గంగా తీరానికి వచ్చి, గంగా ప్రవాహం చాలా సన్ననిపాయగా ఉండటం చూసి ఆశ్చర్యపడ్డాడు. ఒక యువకుడు బాణాలు వేసి గంగా ప్రవాహానికి ఆనకట్ట కడుతూండటం శంతనుడి కంటపడింది.

అప్పుడు గంగ తన పూర్వ రూపంలో శంతనుడి ముందు కనబడి, ఆ కుర్రవాణ్ణి చూపి, " వీడు నీ ఎనిమిదో కొడుకు. ఇంత కాలమూ నేను వీణ్ణి పెంచి పెద్దచేశాను. వీడు వసిష్ఠుడి వద్ద వేదవేదాంగాలు నేర్చుకున్నాడు, పరశరాముడి వద్ద ధనుర్విద్య నేర్చుకున్నాడు. వీడి పేరు దేవవ్రతుడు. ఇక నువు వీణ్ణి తీసుకుపో," అన్నది.

శంతనుడు దేవవ్రతుణ్ణి తన వెంట హస్తినాపురానికి తీసుకుపోయి, యువ రాజును చేసి చాలా సంతోషించాడు.

నాలుగు సంవత్సరాలు గడిచాయి. ఒక నాడు శంతనుడు యమునాతీరానికి విహరించబోయాడు. అక్కడ అతనికి అపూర్వమైన సువాసన తగిలింది. ఆ వాసన వచ్చిన దిక్కుగా వెళ్ళి, ఒక అపురూప సుందరి శరీరం నుంచి ఆ సుగంధం వస్తున్నట్టు తెలుసుకుని, శంతను డామెను పలకరించి,



" నువ్వెవరు ? ఎవరి కూతురువు ? " అని అడిగాడు.

" నేను దాశరాజు కూతుర్ని. నా పేరు మత్స్యగంధి. నన్ను యోజనగంధి అని కూడా పిలుస్తారు. నా తండ్రి ఆజ్ఞాపించగా నే నిక్కడ తెప్ప నడుపుతూ, మనుషులను నది దాటిస్తాను," అన్న దామె.

వెంటనే శంతనుడు దాశరాజున్న చోటికి వెళ్ళి, " నీ కూతుర్ని నా కిచ్చి పెళ్లి చెయ్యి," అని అడిగాడు,

" నీ వంటి అల్లుడు దొరికితే అంత కన్న నా కేం కావాలి? అయితే, నా కూతురుకి పుట్టబోయే కొడుకు నీ అనంతరం రాజయే







టట్టుంటే నా కూతురి నిచ్చి నీకు చేస్తాను," అన్నాడు దాశరాజు.

దేవవ్రతుడు అదివరకే యువరాజై ఉండగా ముందు పుట్టబోయేవాడు తన అనంతరం రాజు కావటం పొసగదు. అందుచేత శంతనుడు దాశరాజు చెప్పినదానికి ఒప్పుకోక ఇంటికి తిరిగి వచ్చి, మత్స్యగంధిని పెళ్ళాడలేక పోయినందుకు పుట్టెడు విచారంలో మునిగిపోయాడు.

దేవవ్రతుడు తండ్రి విచారం గమనించి కారణ మడిగాడు. శంతనుడు దాశరాజు కూతురు మాట చెప్పాడు. వెంటనే దేవవ్రతుడు పెద్ద పరివారాన్ని వెంటబెట్టుకుని దాశరాజు వద్దకు వెళ్ళి, "నా తండ్రికి నీ కుమార్తెను భార్యగా ఇయ్యి," అని అడిగాడు.

దానికి దాశరాజు, "బాబూ, ఈ పిల్ల ఉపరిచరవసువు కూతురు. ఈ పిల్లను ఆయన నా కిస్తూ, దీనిని తగిన వరుడి కిచ్చి చెయ్యమన్నాడు. దీని పేరు సత్యవతి. అసితుడైన దేవలుడు పెళ్ళాడతా నన్నప్పుడు కూడా నేను ఒప్పుకోలేదు. నీ తండ్రి చేసుకుంటానంటే తప్పక ఇస్తాను. కాని నాకు ఒకటే భయం. నువు చూడబోతే మహా యోధుడివి, వీరాగ్రేసరుడివి. సత్యవతికి పుట్టబోయే వాడు నీ ముందు ప్రాణాలతో నిలవటం కల్ల. ఆ భయంతోనే వెనకాడుతున్నాను," అన్నాడు.

అప్పుడు దేవవ్రతుడు దాశరాజుతో, "అలా అయితే నా ప్రతిజ్ఞ విను. నాకు నా తండ్రి రాజ్యం అక్కర్లేదు. సత్యవతికి పుట్టబోయే వాడే అందరితోబాటు నాకూ రాజుగా ఉంటాడు. అందరి ఎదటా నే నీ శపథం చేస్తున్నాను," అన్నాడు.

దాశరాజు దేవవ్రతుడితో, "ఇలాటి ప్రతిజ్ఞ అందరూ చెయ్యగలరా? నువు రాజ్యత్యాగం చేసినా నీ సంతతి ఊరుకో వద్దా?" అన్నాడు.





కాలక్రమాన విచిత్రవీర్యుడికి వివాహ యోగ్యమైన వయసు వచ్చింది. అదే సమయంలో కాశీరాజు తన కుమార్తెలైన అంబ, అంబిక, అంబాలికలకు స్వయంవరం జరుపుతున్నానని చాటింపు వేశాడు. ఈ సంగతి తెలిసి భీష్ముడు సత్యవతితో చెప్పి, రథం మీద కాశీనగరానికి బయలుదేరి వెళ్ళాడు. స్వయంవరానికి అనేకమంది వచ్చి స్వయంవర మందిరంలో చేరారు. భీష్ముడు కూడా అక్కడికి చేరాడు. కాశీరాజు కుమార్తెలకు వచ్చిన వారి వివరాలు చెబుతున్నాడు. భీష్ముడు, "నేనీ కన్యలను నా తమ్ముడికిచ్చి చెయ్యటానికి తీసుకుపోతున్నాను,"



అని ప్రకటించి, అంబనూ, అంబికనూ, అంబాలికనూ తన రథంలోకి ఎక్కించుకుని, అక్కడ చేరిన రాజులతో, "ఈ కన్యలను విడిపించటానికి శక్తిగలవారు నాతో యుద్ధం చేసి నన్ను జయించండి," అని సవాలు చేశాడు.

అందరూ యుద్ధసన్నద్ధులై ఒక్కసారిగా అతని పైకి వచ్చారు. భీష్ముడు అంత మంది నుంచీ తనను రక్షించుకోవటమే గాక, కొందరిని చంపి, కొందరిని గాయపరిచి భీభత్సం కలిగించి, కాశీరాజుకూతుళ్ళతో సహా హస్తినాపురానికి బయలుదేరాడు. అందరూ ఓడిపోయాక సాళ్వుడు అతన్ని ఎదిరించి, ప్రాణాలతో తప్పించుకు పోయాడు.

హస్తినాపురం చేరగానే భీష్ముడు సత్యవతితో సంప్రతించి, కాశీరాజు కుమార్తెలను ముగ్గురినీ విచిత్రవీర్యుడికిచ్చి పెళ్ళి చేయ నిశ్చయించాడు.

అప్పుడు వారిలో పెద్దదైన అంబ, "నేను అదివరకే సాళ్వుణ్ణి వరించాను. అతను కూడా నాపై ప్రేమగా ఉన్నాడు. స్వయంవరం సక్రమంగా జరిగినట్టయితే నేనతన్ని వరించి ఉండే దాన్ని. నన్ను అసహాయురాలిని చేసి తీసుకు వచ్చావు. ఇప్పటికైనా



నా కోరిక చెల్లించటం నీకు ధర్మం," అని భీష్ముడితో అన్నది.

భీష్ముడు మంత్రులతోనూ, పురోహితుల తోనూ, బంధువర్గంతోనూ ఆలోచించి, వారు అనుమతించగా అంబను సాళ్వుడి వద్దకు పంపేసి, అంబికనూ, అంబాలికనూ విచిత్ర వీర్యుడి కిచ్చి పెళ్ళి చేశాడు.

అంబికనూ, అంబాలికనూ పెళ్ళి చేసుకున్నాక విచిత్రవీర్యుడు బొత్తిగా స్త్రీలోలుడైపోయి, రాజ్యకార్యాలను విడిచిపుచ్చి, తన భార్యలతోనే కాలం గడపసాగాడు. అతనికి కాలక్రమాన క్షయవ్యాధి సంప్రాప్తమై, దానితోనే అతను మరణించాడు. భీష్ముడు మరొకసారి తన తమ్ముడికి ఉత్తరక్రియలు చేసి, పుత్రశోకంతో విలపించే సత్యవతిని ఓదార్చాడు,

కొంతకాలమయాక సత్యవతి భీష్ముడితో, "నాయనా, మీ తండ్రి వంశాన్ని నిలబెట్టటానికీ, ఆయనకు పిండాలు వెయ్యటానికీ నువు ఒక్కడివే మిగిలావు. ఆపద్ధర్మంగా, అంబికా అంబాలికల యందు నువు సంతానం కను. అది సమ్మతం కాకపోతే తగిన కన్యను పెళ్ళాడి వంశం నిలబెట్టు," అన్నది.

భీష్ముడిందుకు సమ్మతించలేదు. "నేను చేసిన ప్రతిజ్ఞ తప్పను. ఇంద్రపదవి ఇస్తామన్నా నా నిర్ణయం మారదు. నువు ఆపద్ధర్మమని చెప్పేది అక్షరాలా అధర్మం. ఇంకొక ఆపద్ధర్మం ఉన్నది. దాన్నయినా పెద్దలనూ, ఆప్తులనూ, మంత్రులనూ విచారించి మరీ అమలుచెయ్యాలి. ఆ ఆపద్ధర్మమేమిటంటే, వంశం నిలబెట్టటానికి నీ కోడళ్ళు ఉత్తమ బ్రాహ్మణుల ద్వారా సంతానం పొందవచ్చు. పూర్వం పరశురాముడు ప్రపంచంలోని క్షత్రియులందరినీ చంపినప్పుడు, చనిపోయినవారి భార్యలు బ్రాహ్మణోత్తముల ద్వారా సంతానం పొంది క్షత్రియవంశాలు నిలబెట్టారు. మనంకూడా అలాగే చేయవచ్చు," అన్నాడతను.





# గాంధీ కథ

## 4

గాంధీకి తెల్లవాళ్ళ జాత్యహంకారం ప్రిటోరియాకు వెళ్ళే దారిలో మరింత బాగా అనుభవమయింది. అతని రైలు మరిట్జ్‌బర్గ్ చేరేసరికి చీకటి పడింది. రైల్వే అధికారులు అతన్ని ఒకటో తరగతి పెట్టె నుంచి బలాత్కారంగా దింపేశారు. చాలా చలిగా ఉంది. స్టేషను వెయిటింగ్ రూములో దీపం కూడా లేదు. దక్షిణాఫ్రికాలో భారతీయులు ఎలాటి అవమానాలకు గురి అవుతున్నారో అబ్దుల్లా చెప్పాడు కాడు. ఈ ఉద్యోగం నిలుపుకునేటందుకు తాను ఈ అవమానాలు సహించాలా? లేక ఉద్యోగం మానేసి తిరిగి వెళ్ళి పోవాలా? ఎక్కడనైనా తనకు కష్టాలు తప్పేటట్టు లేవు. రాజకోటలో బ్రిటిషు ఏజంటుతో పేచీ మూలానే తానిక్కడికి వచ్చాడు. దీని అంతు చూడవలిసిందే ననుకుని అతను ప్రయాణం సాగించాడు.

చార్ల్‌స్టన్ వద్ద రైలుప్రయాణం ఆగిపోయింది. అక్కడి నుంచి స్టాండర్టన్ అనే చోటికి గుర్రపు బండీలో ప్రయాణం చెయ్యాలి. బండీ లోపల అంతా తెల్లదొరలు. మోహన్‌ను బండి తోలేవాడి పక్కన కూర్చోమన్నారు. కొంతదూరం పోయాక అతన్ని ఫుట్‌బోర్డు మీద నిలబడమన్నారు. మోహన్ నిరాకరించాడు. బండి నడిపే ఉద్యోగి తెల్లవాడు. నల్లవాడికింత పొగరా అని తెల్లవాడు మోహన్‌ను కొట్ట నారంభించాడు. మోహన్ దెబ్బలు తిన్నాడే గాని కూర్చున్న చోటి నుంచి కదల లేదు. మిగిలిన తెల్లవాళ్ళు అడ్డపడ్డారు.

స్టాండర్టన్ చేరాక గాంధీని కొందరు భారతీయ వర్తకులు కలుసుకుని, ట్రాన్స్‌వాల్‌లో భారతీయులకు ఇలా అవమానాల పాలు కావటం రోజూ అనుభవమేనని



చెప్పారు. జొహాన్సుబర్గ్ చేరి అతను గ్రాండ్ నేషనల్ హొటలుకు వెళ్ళితే, అందులో తెల్లవాళ్ళకు మాత్రమే ప్రవేశం ఉంటుం దన్నారు. అక్కడి నుంచి ప్రిటోరియాకు ఫస్ట్‌క్లాస్ టిక్కెట్టు కొనటమే చాలా ప్రయాస అయింది; స్టేషన్ మాస్టరు ఒకంతట ఆ టిక్కెట్టు ఇవ్వలేదు. తోటి ప్రయాణీకు లైన తెల్లవాళ్ళు కొందరు అడ్డు పడకపోతే అతన్ని ఫస్ట్‌క్లాసు పెట్టె నుంచి గెంటెయ్యడం జరిగేదే.

డర్బాన్ నుంచి ప్రిటోరియాకు అప్పట్లో అయిదు రోజుల ప్రయాణం. ఈ అయిదు రోజులలోనూ దక్షిణాఫ్రికా భారతీయుల పరిస్థితి గాంధీకి బాగా తెలిసి వచ్చింది. భారతీయ వర్తకులు ఈ అవమానాలను సహించటం నేర్చుకున్నారు. కాని గాంధీ నేర్చుకున్నది వేరు. అతని బిడియమంతా పోయింది. అతని అంతరాత్మలోకి ఒక కొత్త దార్ఢ్యం ప్రవేశించింది. ఆ చలిరాత్రి మరిట్జ్ బర్గ్ స్టేషనులో అతను దక్షిణాఫ్రికా భార తీయులకు జరిగే అన్యాయాలను సహించ రాదని తీర్మానించుకున్నాడు. వాటిని ప్రతి ఘటించాలి; అవి అన్యాయాలని నచ్చ జెప్పాలి; పాలకులలో ఉండే సహజ మానవత్వాన్ని చైతన్యవంతం చెయ్యాలి. ఇది కేవలమూ తన సమస్య కాదు, తన జాతిది, మానవజాతిది. దక్షిణాఫ్రికా భార తీయులు పరిస్థితికి తల ఒగ్గారు.

కోర్టులో లేచి నిలబడి మాట్లాడలేక పోయిన గాంధీ ప్రిటోరియా చేరుతూనే అక్కడి భారతీయులను సమావేశ పరిచి, ట్రాన్స్‌వాల్‌లోని భారతీయుల స్థితిని గురించి వారికి చెప్పాడు. సమావేశం జయప్రదంగా జరిగింది. భారతీయుల ఇక్కట్లను బహి రంగ పరచటానికొక సంస్థ ఏర్పడటం మంచిదని గాంధీ సూచించాడు. నేర్చుకో దలచిన వర్తకులకు తాను ఇంగ్లీషు నేర్పుతా నన్నాడు. ఒక మంగలీ, ఒక గుమాస్తా, ఒక

చిల్లర దుకాణంవాడూ అతనికి మొదటి శిష్యులయారు.

ప్రిటోరియాలోని భారతీయులందరూ గాంధీకి పరిచయమయారు. అతను వారి కష్టాలను ప్రిటోరియాలోని బ్రిటిషు ఏజెంటుకు తెలిపాడు. బ్రిటిషు ఏజెంటు గాంధీ చెప్పినదంతా సానుభూతితోనే విని, తాను చేయగలిగినది ఏమీ లేదనీ, ట్రాన్స్‌వాల్ బోయెర్ రాష్ట్రమనీ అన్నాడు.

బోయర్ ప్రభుత్వం ఆరెంజ్ ఫ్రీస్టేట్ నుంచి అదివరకే చాలామంది భారతీయ వలసదార్లను వెళ్ళగొట్టింది. దక్షిణాఫ్రికాలో పరువైన భారతీయుడికి స్థానం ఉన్నట్టు కనబడలేదు.

అతను ఆఫ్రికాకు వచ్చిన అసలు పని ఒక వ్యాజ్యానికి సంబంధించినది. ఈ వ్యాజ్యం ఇద్దరు సంపన్న భారతీయుల మధ్య ఏర్పడింది. ఒకడు నేటాల్‌కు చెందిన అబ్దుల్లా. రెండోవాడు ట్రాన్స్‌వాల్‌కు చెందిన త్యేబ్ శేఠ్ అనేవాడు. ఇద్దరూ కలిసి 40 వేల పౌనుల మొత్తం కోసం తగాదా పడుతూ, ఒకరి అంతు ఒకరు చూడటానికి నిశ్చయించుకున్నారు. గాంధీ చేయవలసిన పని అబ్దుల్లా తాలూకు పద్దులు చూసి, ప్లీడర్లతో సంప్రతించటం. ఎకౌంటు క్లర్కు పని



అన్నమాట. ఎకౌంట్లు గుజరాతీ భాషలో ఉన్నాయి. వాటిని గాంధీ ఇంగ్లీషులోకి తర్జుమా చేసి, ప్లీడర్లు ఎలా పనిచేస్తున్నదీ శ్రద్ధగా గమనించాడు.

ఒక ఏడాదిపాటు ఈ పని చూశాక అతనికి ప్లీడరీ తనకుమించినపని కాదని తెలిసింది. ప్లీడర్లు కేవలమూ వాచాలత్వంతో కేసులు గెలవరు, సాక్ష్యాన్ని సరిగా ఉపయోగించి, నిజాయితీపై ఆధారపడి గెలుస్తారు. నిజాయితీగా ఉన్నవాడికి న్యాయం అనుకూలిస్తుంది.

పరిశీలించి చూస్తే న్యాయం అబ్దుల్లా పక్షానే ఉన్నది. కాని వ్యాజ్యం పొడిగించిన

కొద్దీ ఉభయపక్షాలకూ తీరని నష్టం కలుగుతున్నది. కక్షలు పెరగటమేగాక, డబ్బు మంచినీరులాగా ఖర్చవుతున్నది. అతి కష్టం మీద ఉభయపక్షాలూ మధ్యవర్తి నిర్ణయానికి ఒప్పుకున్నాయి.

మధ్యవర్తి తీర్పు అబ్దుల్లాకే అనుకూలమయింది. ఆ తీర్పును వెంటనే అమలు చేసేపక్షంలో త్యేబ్ శేత్ దివాలా ఎత్తటం ఖాయం. అతని వద్ద దఫాలవారీగా డబ్బు తీసుకునేటందుకు అబ్దుల్లాను గాంధీ ఒప్పించాడు. లాయరు చెయ్యవలసిన పని ప్రతిపక్షులను ఏకంచెయ్యటమే నని అతనికి తోచింది.

ఎప్పుడైతే వ్యాజ్యం పరిష్కారమయిందో అప్పుడే గాంధీ ఉద్యోగంకూడా అయిపోయింది. స్టీమరెక్కి ఇండియాకు వచ్చేద్దామని అతను ప్రిటోరియా నుంచి డర్బానుకు వచ్చేశాడు. అబ్దుల్లా అతని గౌరవార్థం వీడ్కోలు విందు ఏర్పాటు చేశాడు. ఆ విందులో ఒక పత్రికలోని వార్త ఒకటి గాంధీ కంటపడింది. ఆ వార్త ఏమంటే, నేటాలులో నివసించే భారతీయులకు వోటింగుహక్కు లేకుండా చెయ్యటానికి నేటాలు శాసనసభలో ఒక బిల్లు ప్రవేశపెట్టబోతున్నారట.

అబ్దుల్లాకు గాని, విందుకు వచ్చిన ఇతర వర్తకులకుగాని ఈ విషయమై ఏమీ తెలీదు. వారికి తెల్లవారితో వర్తకరీత్యా సంభాషించేపాటి ఇంగ్లీషుమాత్రమే వచ్చును గాని, పత్రికలు చదివేపాటి రాదు. అదీగాక వారు వర్తకం చేసుకునేనిమిత్తం వచ్చినవారేగాని రాజకీయాలలో వారికి ఆసక్తిలేదు. రాజకీయాలకూ, తమ వ్యాపారానికీ సంబంధం ఉన్నదని వారెరగరు. ఆరెంజి ఫ్రీస్టేటు నుంచి అంతక్రితమే భారతీయ వర్తకులను పారదోలారు. నేటాలు కూడా అదే రకం జాతివివక్షతను అనుసరించబోతున్నది.



# 91. ప్రాచీన రోమను దేవాలయం

ట్యునీషియా (ఉత్తర ఆఫ్రికా) లోని రోమను నిర్మాణా లన్నిటిలోకి ప్రశస్తమైన ఈ నిర్మాణం డూగ్గా అనే చోట ఉన్నది. జూపిటర్, జూనో, మినర్వా అనే దేవతల కోసం ఈ ఆలయం నిర్మించబడింది. బొమ్మలో కనిపించేది ఆలయమండపం. దీనికి 43 అడుగుల ఎత్తు గల పాలరాతి స్తంభాలు ఆరున్నాయి. మార్కస్ అరిలియస్ పరిపాలనా కాలంలో (క్రీ. శ. 166–169) దీని నిర్మాణం జరిగింది. బైజాంటైన్ సామ్రాజ్యం నడిచిన కాలంలో దీన్ని దుర్గంగా ఉపయోగించారు.



Photo by Prasad



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలహాలు రేపకపోతే

పంపినవారు:
ఎం. వి. రత్నకుమారి, వరంగల్

Photo by P. Jayaraj



బహుమతి
పొందిన వ్యాఖ్య

కలసిమెలసి వుంటామండీ

పంపినవారు:
ఎం. వి. రత్నకుమారి, వరంగల్

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1969 ఆగస్టు నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ జూన్ నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కలహాలు రేపకపోతే

రెండవ ఫోటో : కలసిమెలసి వుంటామండీ

పంపినవారు : ఎం. వి. రత్నకుమారి,

C/o శ్రీ ఎం. సీతారామయ్య, వరంగల్.

బహుమతి మొత్తం రు. 20/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road. Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

# కొంగ-నక్క

(నీతికథ మరోసారి)

రాజు అడవిలో నివసించే జిత్తుల మారి నక్క తనతో అడవిలో నివసించే వారిని వేళాకోళం చెయ్యటమంటే యిష్టపడు. ఒక నాడు... 1

ఆ వేళాకోళమైన కొంగ శంకర్‌ని విందుకు పిలిచి పల్చటి పళ్ళెంలో వడ్డించింది

2

అయ్యో! ఎంత మోసపోయాను!

3

...ఆశగొల్పించే బ్రూక్ బాండ్ A-1 డస్ట్ తేనీటిని ఇచ్చింది... నిడుపాటి మెడగల తూజాలలో!

వెంటనే శంకర్ రాజుని విందుకు పిలిచి...

4

Brooke Bond Tea

Brooke Bond A1 Dust Tea

5

రాజుకు బాగా తెలిసింది పాఠము

ఓహో! ఎత్తుకు పై ఎత్తు!

6

బ్రూక్ బాండ్ A-1 డస్ట్ టీ తోటే ప్రారంభిస్తాయి ఉత్తమ అవకాశాలు

ఒక ప్యాకెట్లో ఎన్నెన్నో కప్పుల ఆనందము

Brooke Bond A1 Dust Tea

రాజుకి అహంకారం తగ్గింది— అందరికీ సమానంగా రుచికరమైన A.1 డస్ట్ టీతో విందు చేస్తున్నాడు. 7

BB 5221





## నియమ విధులను పాటిస్తూ ఆడడం నేర్పుతున్నారా? ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణను కూడా అతనికి నేర్పండి

మీ బిడ్డ జీవితంలో ప్రతిదీ సక్రమంగా, నియమబద్ధంగా చేసి, తనుచేసే ప్రతి విషయంలో తన స్నేహితులను మించి పోవాలనుకునే సమయమొస్తుంది. అదే సరియైన దంత సంరక్షణ—ఫోర్‌హాన్స్‌తో—నేర్పుటకు మంచి తరుణం □ ఫోర్‌హాన్స్ ఇగుళ్ళ జబ్బులను దంత క్షీణతను నివారించు టూత్ పేస్టు. ఒక దంత వైద్యుని చేత నిర్మింపబడ్డ యీ టూత్ పేస్టులో బిగువైన పళ్ళకు ఇగుళ్ళకు కావలసిన ప్రత్యేకమైన మందులున్నాయి. అది మీకు మంచిది—మీ బిడ్డకు కూడా మంచిది. అందుకని నియమం తప్పకుండా తన పళ్ళను ఫోర్‌హాన్స్‌తో—ఉదయం, రాత్రి తోము కోవడం నేర్పండి. జీవితాంతం అవసరమైన దంత సంరక్షణ ఇప్పుడే నేర్పండి.

**జాగు చేయ్యక ఫోర్‌హాన్స్‌తో దంతసంరక్షణ ఇప్పుడే నేర్పండి**

ఉచితం : "పళ్లు, ఇగుళ్ళను గురించి తీసుకోవలసిన శ్రద్ధ"* అనే రంగుల చిత్రాలలోనున్న ఈ చిన్న పుస్తకం అనేక విషయాలను తెలుపుతుంది. పది భాషల్లో† దొరుకుతుంది. (తపాలా ఖర్చుకు) 15 పై. బిళ్ళలు పంపండి.

అడ్రసు : మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్టు బ్యాగు నం. 10031, బొంబాయి-1.

పేరు ______________________

అడ్రసు ______________________

† మీకు కావలసిన భాష క్రింద గీత పెట్టండి: తెలుగు, ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, అరవం, మలయాళం, కన్నడ.

* ఈ పుస్తకం అతడు చదివే పుస్తకాలలోకెల్ల ముఖ్యమైనది కావచ్చు




**ఫోర్‌హాన్స్ టూత్ పేస్టు — ఒక దంతవైద్యుడు నిర్మించినది**

32F-182 TEL

'C. 1'

# 'ఇప్పుడు నా చురుకుతనాన్ని చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!'



కాని, కొన్ని నెలల క్రితము నీరసంతో నేను ఆఫీసు పని సరిగ్గా చేయ లేక పోయాను. చివరకి ఒక డాక్టర్ని సంప్రదించాను.

డాక్టరు ఇలా అన్నారు: "మీకు కావలసినంత పోషణ లభించలేదు. హార్లిక్స్ త్రాగండి!"

హార్లిక్స్ త్వరలోనే నాకు శక్తి ఉత్సాహములను కలిగించింది. ఇప్పుడు నేను ఓపికతో చురుకుగా పని చేయడం చూచి అందరూ ఆశ్చర్యపడుతున్నారు!





**హార్లిక్స్ వాడడం వల్ల శక్తి ఉత్సాహాలతో వున్నాను!**

సరైన పోషణ లేక పోవడం వల్ల కలిగే నీరసము, అలసట కొన్ని సమయాల్లో ఉద్యోగమునకే హాని కలిగించవచ్చు. వీటికి ప్రతివిధిగా డాక్టర్లు హార్లిక్స్ సిఫార్సు చేస్తారు. హార్లిక్స్ అదనపు పోషణత్వాన్ని యిచ్చి శక్తి ఉత్సాహము, మంచి ఆరోగ్యము కలుగచేస్తుంది.




**హార్లిక్స్** అదనపు శక్తిని కలిగించును!



63
XXVII


బాడిగ రామకృష్ణ సమర్పించు ఎం.వి.ఆర్.పిక్చర్స్ వారి
ముహూర్త బలం
నిర్మాతలు:
వై.వి.వి.ఎస్.ఎస్.వి.ప్రసాదరావు
ఎం.వి.రామదాసు
దర్శకుడు:
ఎం.మల్లికార్జునరావు
కో-ప్రొడ్యూసర్:
ఎం.బాజీరావు
మాటలు
ముళ్ళపూడి
సంగీతం:
కె.వి.మహదేవన్
ఆంధ్ర, నైజాం:
లక్ష్మీ ఫిలింస్
సీడెడ్
జయలక్ష్మి
GOTETI

